# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# మీ యింటి చిన్న పిల్లలను నిలవచేసికొను అలవాటును అలవరచుకొన నీయుడు...

...వారుకూడ **స్వంత పాస్ బుక్కు** లుండవలయునని సంబర పడుదురు — ది బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ లో, ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున—సేవింగ్స్ బ్యాంక్ ఎక్కవుంట్సును ఏల ఆరంభింప రాదు?....వారు బడులలో పరీక్షలు పాసయిన దానికి, ఇంటిలో చిన్న చిన్న పనులు చేసిన దానికి, పుట్టిన రోజులకు, ఇతరములయిన కానుకలకు-ధనరూపమయిన బహుమానముల నొసంగుచు, వారు సంపాదించిన సొమ్మును నిలువచేసికొనునట్లుగా వారికి మీరు ప్రోత్సాహమీయుడు.



ప్రత్యేక సౌకర్యము ■ సంవత్సరమునకు మీకు **100 చెక్కులు:** ఎప్పుడు కావలసిన అప్పుడు, ఎంతసొమ్మునయిన, ముందుగా నోటీసీయ నక్కరలేకుండగనే తీసికొనవచ్చును—మఱి, మీరు నిలవయుంచిన ధనమునకు సంవత్సరమునకు 3% చక్రవృద్ధి వచ్చునుగదా.

# ది బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్

టి. డి. కన్సారా, జనరల్ మేనేజర్

B/C/98 TL

సెప్టెంబర్ విడుదల!







కౌసల్యా ప్రొడక్షన్స్ వారి....

# నువ్వా - నేనా?

సంగీతం: K.V.మహాదేవన్

దర్శకత్వం: ఆమంచర్ల శేషగిరిరావు

మాటలు-పాటలు: ఆరుద్ర



CHITRALEKHA

నిర్మాతలు:

S.భావనారాయణ

P.C.బాలకృష్ణరాజు




9

# వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండు




## ఆరోగ్యానికీ శక్తికీ

దీనిని ఎంచుకొనడానికిగల నాలుగు కారణాలు...

1. సంవత్సరమంతా, అన్ని ఋతువులలోను, వాతావరణాలలోను. పిల్లలకూ, పెద్దలకూ ఆనందదాయకమైన, రుచికరమైన టానిక్కు.
2. రక్తాన్ని బలపరుస్తుంది, నరాలకు పత్తువ నిస్తుంది.
3. ఆకలి పుట్టించడానికీ, జబ్బునుంచి తేరుకొనేవారికీ ఇదిమంచిది. ఆహార లోపాన్ని ఇది పూర్తి చేస్తుంది.
4. కోల్పోయిన ఆరోగ్యాన్ని తిరిగి సమకూర్చుకొనేటందుకు ఇది సాటిలేనిది. అనారోగ్యం, ఆకలిలోపం, అలసట, ఖనిజలోపం, భౌతిక, మానసిక అలసట- వీటిని దూరం చేస్తుంది.

# వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండు

వార్నర్-లాంబర్ట్ ఫర్మాస్యూటికల్ కంపెనీ

(మిత బాధ్యతలతో యు.ఎస్.ఎ. లో స్థాపితము)

# పాఠకుల లేఖలు

## సెప్టెంబర్ 1962

"రాకాసిలోయ" సీరియల్ చదివిన తరవాతకూడ మళ్ళీ మళ్ళీ చదవా లనిపిస్తుంది. "నిలబెట్టిన కాపురం," "కృతాకృతుడు," "పచ్చి మోసం," "పుణ్యం, పాపం," "అన్నా, చెల్లెలు"—ఈ కథలు నన్ను యెంతో ఆకర్షించినవి.

—పి. ఆనందరావు, హైదరాబాదు

రామాయణము చాలా అద్భుతంగా యున్నది. "అన్నా—చెల్లెలు" సీరియల్ కూడ చాలా బాగుగానున్నది.

—బరాటం మిన్నారావు, గుడారి

కథలు అన్నియును బాగున్నవి. "నిలబెట్టిన కాపురం" చాలా బాగుంది. "పచ్చి మోసం" కూడా బాగుంది. "కృతాకృతుడు" అంత బాగులేదు.

—కె. నారాయణమూర్తి, బరంపురం

శ్రీ వెంకటేశ్వరుని మహత్మ్యం వల్ల ప్రతి నెల అద్భుత కథల మాసపత్రిక "చందమామ" చదువు అదృష్టము కల్గినది.

—ఎస్. సత్యనారాయణ, కవేకల్లు

మా ఈ "చందమామా" వచ్చినతోడనే నిరుత్సాహమును, ఆతురతను పోగొట్టి ఆనందమును కల్గించుతుంది.

—ఏ. బి. హనుమంతరావు, హైద్రాబాద్

ఉత్పల సత్యనారాయణాచార్యగారి "కుమార సంభవము" చాలా బావుంది. "రాకాసిలోయ" చందమామకు వన్నె తెచ్చినదనుట అతిశయోక్తి కాదు. రచయితలకు మా అభివందనములు.

—పువ్వాడ వెంకటేశ్వర్లు, కంకిపాటి రవీంద్రనాథఠాగూర్, బాపట్ల

"పచ్చి మోసం" అనే కథ ఏమి బాగాలేదు. మిగతా కథలన్నీ బాగున్నాయి. "స్నేహితులు" హాస్యం బావుంది.

—సి. వి. సుబ్బారాయులు, నెల్లూరు

"అన్నా—చెల్లెలు" సీరియల్ అమోఘం.

—బి. లక్ష్మీదేవి, ఉయ్యూరు

"పచ్చిమోసం" చాలా అద్భుతంగా వుంది. "నిలబెట్టిన కాపరం" ఈ నెల "చందమామ"కు వన్నె తెచ్చింది.

—ఆర్. కె. క్రిష్ణమూర్తి, కుటాగుళ్ళ

ఆగస్టు సంచిక మే మనుకోనంత ఆకర్షణీయంగా తయారై, ఉర్రూతలూగించే ఉత్తమ కథలతో సర్వాంగ సుందరీలాగా సింగారించుకొని మా చేతుల్లో వ్రాలింది. సంచిక ఇంత అందంగా తయారవ్వడానికి తోడ్పడిన రచయితలకు, చిత్రకారులకు మా అభినందనాలు.

—ఆర్. వి. ప్రేమకుమారి, ఆర్. వి. నిర్మలాబాయి, మద్రాసు

"రాకాసిలోయ"ను పొడిగిస్తారని వింటూనే నేను చాలా సంతోషించాను.

—ఎస్. వి. సుబ్బారెడ్డి, కోవెలకుంట్ల

గుండు భీమన్న గొప్పతనం సులువుగా కనపడదు. అయినా వాడు గొప్ప గుణం కల్లాడేను. పరోపకారి పాపన్న అలాంటివాడుకాడు. చాలా గొప్పాడు. వీడి చేయిపట్టు పిల్ల ఏమి పుణ్యవంతురాలో కదా!

—నాగమ్మ, వేములవాడపేట

సినిమా
తారలు
మెచ్చిన




రెమి
పౌడర్

..అంతరాష్ట్రీయ ఖ్యాతిగాంచిన భారతీయ నృత్యతార

# కమలా లక్ష్మణ్

వారి

మెచ్చికకు పాత్రమైనవి..

ఫ్యాషన్..

నమూనాలు..

వన్నెలు..

నాగరికత..

వీటికొరకు

శ్రీ
వెంకటేశ్వర
సిల్క్ చీరలు

## శ్రీ వెంకటేశ్వర
సిల్క్ ప్యాలెస్

స్త్రీల ఉన్నతమైన వస్త్రాలకు
ఆవశ్యమైన స్థలం

284/1, చిక్కపేట, బెంగళూరు-2

ఫోన్: 6440

టెలిగ్రాం: "ROOPMANDIR"

M.H.Rao



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మనకు మరొక స్వాతంత్ర్య దినం వచ్చింది. అగస్టు 15 తో మన దేశం స్వతంత్రమై పదిహేనేళ్ళయింది.

అగస్టు మాసంలోనే మానవ చరిత్రలో మరొక అద్భుతమైన సంఘటన జరిగింది. సోవియెట్ రష్యా వారు ఇద్దరు గగన యాత్రికులను ఒకరోజు తేడాలో ఆకాశంలోకి పంపారు. ఈ ఇద్దరు గగన యాత్రికులూ ఆకాశంలో మూడు నాలుగు రోజులు ప్రయాణించి సురక్షితంగా భూమికి దిగి వచ్చారు. మానవులు చందమామ వద్దకు చేరటానికి జరిగే ప్రయత్నంలో ఇదొక ముందడుగు. మానవులు ఆకాశ నౌకలలో చంద్రుడి చుట్టూ తిరిగి భూమికి వచ్చి చేరటమూ, చంద్రుడి పైన దిగటమూ చూడబోతున్నాం.

సంపుటి : 31 సెప్టెంబర్ 1962 సంచిక : 3



# భారత చరిత్ర




క్రీ. శ. 646-647 లో హర్షుడు పరమపదించాడు. ఇతని మరణానంతరం మధ్యదేశంలో ఏర్పడిన అరాజకం, 836 లో మొదటి భోజుడనే ప్రతిహారరాజు పరిపాలన నాటి దాకా సాగింది. కన్యాకుబ్జం యొక్క ఘనతను కాపాడటానికి యశోవర్మలాటి రాజులు చేసిన ప్రయత్నాలు సాగలేదు. మధ్యప్రదేశం వెలపల ఉండే రాజు లందరి కళ్ళూ కన్యాకుబ్జంపైనే ఉండేవి. 10 వ శతాబ్దందాకా ప్రతిహారులు కన్యాకుబ్జం ఘనతను కాపాడారు. చివరకు 1194 లో కన్యాకుబ్జం పతనమయింది.

హర్షుడికి కొడుకులున్నట్టు కనబడదు. అతని కుమార్తె వలభీ రాజైన ధృవభటుణ్ణి పెళ్ళాడింది. హర్షుడి అనంతరం హర్షుడి కీర్తి ప్రపత్తులను ఆశించిన వారిలో ధృవభటుడి కొడుకు ధీరసేనుడనేవాడు ఒకడు. ఇతను "పరమభట్టారక మహారాజాధిరాజ పరమేశ్వర చక్రవర్తి" అనే బిరుదు ధరించాడు.

మధ్యదేశంలో (గంగా లోయ ఎగువ ప్రాంతంలో) ఆదిత్యసేను డనేవాడు 672లో శక్తిమంతుడై విరాజిల్లాడు. ఇతని తండ్రి మాధవగుప్తుడు హర్షుడితో సఖ్యం గలవాడు. ఆదిత్యసేనుడు రాజ్యానికి వస్తూనే అశ్వమేధం చేశాడు. ఇతను మాల్వా, మగధ దేశాలకు చెందిన గుప్తవంశ శాఖవాడు. ఇతను తన కాలపు ప్రసిద్ధ వంశాలన్నిటితోటీ వియ్యాలు నెరపాడు. తన కుమార్తెను మౌఖరి వంశంవాడైన భోగవర్మకు ఇచ్చాడు.

ఆదిత్యసేనుడి తరువాత మగధలో దేవగుప్తుడు, విష్ణుగుప్తుడు, జీవితగుప్తుడు అనే వారు పరిపాలించారు. కాని 8 వ శతాబ్దం ఆరంభంలో మగధ గౌడుల వశమయింది. (పశ్చిమ, పశ్చిమోత్తర బెంగాలు ప్రాంతం గౌడదేశం. అక్కడివారు గౌడులు. తూర్పు,

12. హర్షుడి అనంతరం

మధ్య బెంగాలు ప్రాంతం వంగదేశం.) ఈ గౌడులు మగధలో ఎంతో కాలం వెలిగే అవకాశం లేకుండా కన్యాకుబ్జం తిరిగి ఉజ్వలమయింది. చంద్రవంశం వాణ్ణని చెప్పుకునే యశోవర్మ అనేవాడు తన కీర్తిని దిగంతాలకు వ్యాపింపజేశాడు. ఇతని గాథలు "గౌడవహో" అనే ప్రాకృత గ్రంథంలో వాక్పతిరాజ అనే కవి రచించాడు. యశోవర్మ హర్షుడి అడుగు జాడలలో నడిచాడు; గౌడరాజుపై దండెత్తి, అతణ్ణి యుద్ధంలో చంపాడు; వంగదేశాన్ని జయించి, దక్షిణాభిముఖుడై నర్మదా తీరం దాకా వెళ్ళాడు. తరవాత రాజపుత్రస్థానపు ఎడారి మీదుగా తన రాజధానికి వచ్చి చేరాడు. వాక్పతిరాజ అనేవాడూ, భవభూతీ ఈ యశోవర్మ ఆస్థాన కవులు. హర్షుడిలాగే ఇతనుకూడా 731లో చీనాతో రాయబార సంబంధాలు ఏర్పాటు చేసుకున్నాడు. చివరకు యశోవర్మ లలితాదిత్యుడనే కాశ్మీరు రాజుతో యుద్ధం చేసి చనిపోయాడు.

కాశ్మీరులోయ అశోక, కనిష్క, మిహిర కుల రాజుల సామ్రాజ్యంలో ఒక ప్రాంతంగా ఉండి, 7వ శతాబ్దిలో ఒక ప్రముఖ రాజ్యంగా రూపొందింది. దుర్లభవర్ధనుడనేవాడు మూలపురుషుడుగా గల కార్కోట



వంశం వారు కాశ్మీరును ఏలారు. ఈ రాజ్యం చీనా చక్రవర్తికి లోబడి ఉండినట్టు కనబడుతుంది. దుర్లభవర్ధనుడి మనమలు చంద్రాపీడుడూ, ముక్తాపీడ లలితాదిత్యుడూ అనేవారు చీనా చక్రవర్తి నుంచి కాశ్మీరు రాజ్యాధిపత్యం స్వీకరించారు. లలితాదిత్యుడు గొప్ప యోధుడు. ఇతను యశోవర్మను ఓడించటమేగాక టిబెటనులనూ, దర్దులనూ, తురుష్కులనూ సింధు ప్రాంతంలో ఓడించి, గౌడరాజును వధించాడు. ఇతను కట్టించిన మార్తాండాలయం ప్రసిద్ధమైనది.

జయాపీడవినయాదిత్యుడనే వాడు లలితాదిత్యుడి మనమడు. తాతగారిలాగే

గౌడ, కన్యాకుబ్జ రాజులను జయించాడు. ఇతని ఆస్థానంలో క్షీరస్వామి, ఉద్భటుడు, దామోదరగుప్త, వామనుడు మొదలైన పండితులుండేవారు. అయితే ఇతను ప్రజలను పన్నుల భారంతో పీడించి చాలా అపనిందకు గురి అయాడు. 855 లో ఈ వంశం అంతరించి, ఉత్పల వంశంవారు కాశ్మీరానికి రాజులయారు.

ఉత్పలవంశ మూలపురుషుడు అవంతి వర్మ నీటి పారుదల సౌకర్యాలు విరివిగా చేశాడు. ఇతని కుమారుడు శంకరవర్మ కాశ్మీర రాజ్యాన్ని అనేక దిక్కుల విస్తరింపజేశాడు; కన్యాకుబ్జ రాజైన మొదటి భోజుడి తోనూ, ఉదభాండపుర (సింధు ప్రాంతం) రాజైన లల్లియషాహీ తోనూ యుద్ధాలు చేశాడు. గుర్జీరుల నుంచి పంజాబులో కొంత ప్రాంతం లాక్కున్నాడు. ఇతను కూడా పన్నులతో ప్రజలను పీడించగా, ఇప్పటి హజారా జిల్లాలోని ఉరశగ్రామ పౌరులు ఇతనిపై తిరగబడి చంపేశారు. కొంత కాలం పాటు అరాజకం చెలరేగిన పిమ్మట కాశ్మీర బ్రాహ్మణులు కృషిచేసి యశస్కరుడనే బ్రాహ్మణ్ణిరాజుగా చేశారు.

యశస్కరుడి సంతతి కొంతకాలం కాశ్మీరును పాలించిన మీదట పర్వగుప్తు డనే వాడు రాజయాడు. పర్వగుప్తుడి కొడుకు రాజ్యానికి వచ్చాక అతని భార్య దిద్దా అనే ఆమె రాజ్యభారం తానే వహించింది. 1003 దాకా అమె రాజ్యం చేసి తరవాత తన కిరీటాన్ని సంగ్రామరాజ అనే వాడికి ఇచ్చింది. ఇతను లోహర వంశ స్థాపకుడు.

సంగ్రామరాజ కాలంలోనే ఘజ్నీ మహమ్మద్ ఉదభాండపుర రాజ్యంపై పడ్డాడు. కాశ్మీరం నుంచి సహాయం అందినప్పటికీ ఉదభాండపురం ఓడిపోయింది. కాశ్మీర రాజ్యం ఘజ్నీ మహమ్మద్ వాత పడకే తప్పించుకున్నదే గాని అంతః కలహాలు దాన్ని కుంగదీశాయి.





# కుమారసంభవము

ద్వితీయాశ్వాసము :

స్వాహాసతి తోడ అగ్ని
వాహనమగు పొట్టేలును
ఎక్కి బయలుదేఱినాడు,
హిమవంతము చేరినాడు.

ధవళగిరికి దక్షిణముగ
ప్రవహించెడు గంగానది
నీరెంతయు నిర్మలముగ
నిండి తొణకులాడుచుండె!

ప్రక్కననే ఇసుక బయలు
బంగారపు పొలము వోలె
చూపుమేర కనిపించెను
సూర్యోదయ వేళయందు.

అలలదేలు గంగానది
జలముల మొలబంటిగ దిగి,
ముక్కు మూసికొని జ్వలనుడు
ముమ్మాఱులు మునిగినాడు.

క్షణములోన అచటి జలము
సలసలమని క్రాగిపోయె!
స్వాహాసతి తత్తఱ పడి
స్నాన మాపి ఒడ్డు చేరె.

అంతలోన, "అగ్నిహోత్ర!
ఆగు మాగు," మనుచు గంగ
స్త్రీ రూపముతో పరుగున
తీరమునకు వచ్చి నిలిచె!

ఆమె యుగ్రరూపము గని
అగ్నిహోత్రు డులుకుతోడ
శిరము వంచి నిలుచుండెను,
శిక్షార్హునివలె నుండెను!

పటపటమని పండ్లు కొఱికి
పలికె నపుడు గంగానది:
"అగ్నిహోత్ర! ఏమది నీ
ఆగడమ్ము మితిమీఱెను.

ఉత్పల సత్యనారాయణాచార్య



'ఎవరా సోదరు'డని కను
లెఱ్ఱచేసి పలికె గంగ ;
బ్రహ్మదేవుడని మెల్లగ
బదులు పలికె నా జ్వాలనుడు.

అది విని యొక క్షణము గంగ
పెదవికొఱికి యోచించెను ;
స్వాహాసతి గంగ యెదుట
సాగిలపడి విలపించెను.

చెరచెరమని గంగానది
చీరచెంగు జీరాడగ,
పట్టరాని ఆగ్రహమున
బ్రహ్మకడకు పయనమయ్యె,

భువర్లోక, మహర్లోక,
సువర్లోకములను దాటి,
సత్యలోకమునకు వేగ
సాగిపోయె గంగానది.

సత్యలోకమందు బ్రహ్మ
సౌధమెంతొ సుపవిత్రము !
విప్పారిన దళములతో
ఒప్పుచున్న శతపత్రము !

రోషముతో విసవిసమని
లోనికేగు గంగను కని,
తికమకపడి దిక్పాలురు
ఒకరి నొకరు చూచుకొనిరి.

ఈ నదిలో నిన్నెవ్వరు
స్నానమాడుమని చెప్పిరి ?
అన్నింటిని తినువాడవు !
అంటరానివాడ వీవు !"

అని కన్నులు జేవురింప,
అధరోష్ఠము కంపింపగ,
ఆగ్రహమున గంగ పలుక,
అగ్నిహోత్రు డిట్లనియెను :

"ఓ తరుణీ ! శాంతించుము !
నా తప్పిదమేమి లేదు;
నీ సోదరు నానతి గొని
నే స్నానము సలిపి తిచట.

వీణనుగొని నారదముని
లోననుండి అరుదెంచుచు,
ఎదురు పడిన గంగను కని
బెదిరి పోయి నిలుచుండెను!

అడు బిడ్డ గంగానది
ఆగ్రహమున వచ్చుట కని,
పాట నాపి వీణను గొని,
భారతి లోనికి వెళ్ళెను.

"అన్నా! ఏమని నీ వా
అగ్నికి సెలవిచ్చినావు?
చెలియలి కడు పుడుకునట్లు
సలసల క్రాగించినావు!

దివి నుండిన నన్ను నీవు
దిగద్రోసితి, పది చాలక
కడుపులోన చిచ్చుపెట్టి
కాల్చి చంపదలచినావు!"

అని పలుకుచు గంగానది
కనుల నీళ్ళు వెల్లివొడువ
వెక్కసపడి దూషించెను,
వెక్కివెక్కి దుఃఖించెను.

పద్మాసన మందు నుండి
బ్రహ్మ యపుడు దిగ్గున దిగి,
"చెల్లీ! దుఃఖింపకు—విధి
చేష్టకు దూషింపకు," మనె.



"విధియట విధి! నీవుకాక
వేఱొక విధి ఎందు గలదు?
ఇట్టి పనులు నీవుకాక
ఎవ్వరికను చేయగలరు?"

అని రోషముతోడ గంగ
కనులింతలు చేసి పలుక,
బ్రహ్మదేవు డోదార్చుచు
పలికె నిట్లు బతిమాలుచు:

"సోదరి! నీవలె నగ్నియు
సుపవిత్రుండైన వాడు-
ఐనగాని నీ కంటెను
అతడు శక్తిశాలి కాడు.

పరమేశుని శక్తి అతని
పైనుండుట చేత నీకు
సంతాపం బింత కలిగె,
సహన శక్తి కొంత తొలగె.

అంతె కాని, నీ జలముల
అగ్నిహోత్రు డంటుకొనిన
చప్పున చల్లారి పోడె!
చయ్యన మసిబొగ్గు కాడె!

చెల్లీ! నే చెప్పినట్లు
చేయుము నీ బాధ తొలగు,
నీ క్రాగిన ఆ జలముల
నెట్టివేయు మెటకైనను.

శరవణమను పరమ పుణ్య
సరసిలోని కా జలముల
తరలించిన మేలగు; నీ
తాపమెల్ల తొలగిపోవు."

అని విధాత తన సోదరి
కనుల నీరు గోట దుడిచి,
బుజ్జగించి పంప, నామె
పురపుర పొక్కుచు పోయెను!-(సశేషం)






## 15

[తనకు అరణ్యంలో జరిగిన ప్రమాదాన్ని గురించి బ్రహ్మదండి మాంత్రికుడు, రాజ గురువుకు వార్త పంపాడు. సేనానాయకుడు; కేశవుడూ వాళ్ళ కోసం అరణ్యమంతా గాలించేందుకు సైనికులను పంపాడు. కోయలపెద్ద, కేశవుణ్ణీ, అతడి అనుచరులనూ రాజ్య సరిహద్దులు దాటించేందుకు యిద్దరు కోయయువకుల్ని నియోగించాడు. —తరవాత]

కోయయువకుల వెంట అరణ్యంలో కొంత దూరం ప్రయాణించే సరికి, కేశవుడూ వాళ్ళకు, తాము బ్రహ్మపురరాజ్య సరిహద్దులు దాటి పారిపోవటం అంత తేలిక కాదని అర్థమైపోయింది. బ్రహ్మపుర సేనానాయకుడు పంపిన సైనికులు అరణ్యమార్గాల వెంట విచ్చలవిడిగా తిరుగుతున్నారు. అంతేకాక, అర్ధరాజ్యం వస్తుందన్న ఆశతో కొందరు ఆటవికులు కేశవుడి కోసం చెట్లూపుట్టలూ వెతుకుతున్నారు. ఇంతమంది కనుగప్పి పారిపోవటం సాధ్యమా? అన్న అనుమానం ముగ్గుర్నీ బాధించసాగింది.

"రాజ్యసరిహద్దులు దాటి పోయేందుకు సైనికుల కెవరికీ తెలియని రహస్యమార్గాలు మీకేమైనా తెలుసా?" అని కేశవుడి ముసలి తండ్రి, కోయయువకుల్ని ప్రశ్నించాడు.

"మాకు ఈ అరణ్యంలో తెలిసిన అనేక రహస్య మార్గాలున్నవి. వాటిల్లో ఏ ఒకటీ బ్రహ్మపుర సైనికులకు తెలియదని




నా నమ్మకం. మనకు ప్రమాదం వచ్చేది వాళ్ళనుంచి కాదు. రాజు యిస్తానన్న అర్ధ రాజ్యానికి ఆశించి, మిమ్మల్ని పట్టుకో జూస్తున్న ఆటవికులే మనకు ప్రమాదకారులు. వాళ్ళకుక్కూడా అన్ని గుప్త మార్గాలూ తెలును," అన్నాడొక కోయ యువకుడు. అంతలో వాళ్ళకు ఎదురుగా వున్న కొండరాళ్ళ మీద కొందరు సైనికులు కనిపించారు. వాళ్ళ వెంట ఇద్దరు ఆటవికులు కూడా వున్నారు.

"అందరూ చెట్లచాటుకు పదండి. సైనికులు మన కేసే వస్తున్నట్టున్నది," అంటూ కోయయువకులు చప్పున వెనుదిరిగి, చెట్లమాటుకు పరిగెత్తారు. కేశవుడూ, జయమల్లూ ముసలివాడూ కూడా వాళ్ళవెంట పరిగెత్తారు.

అందరూ చెట్లచాటున దాక్కొని, సైనికుల కేసి చూడసాగారు. జయమల్లు పెద్దగా నిట్టూరుస్తూ, "మేం కోయవేషాలు వేసుకున్నాం గదా, అలాంటప్పుడు సైనికులతో దాగుడుమూత లెందుకు? నిర్భయంగా వాళ్ళు చూస్తూండగానే రాజ్యసరిహద్దులు దాటవచ్చునే!" అన్నాడు.

"సైనికులకు మీరు కోయవాళ్ళలా కనిపించవచ్చునేమోగాని, వాళ్ళ వెంటవున్న ఆటవికులు మీ రెవరైందీ వెంటనే పసికట్ట గలరు," అన్నాడొక కోయయువకుడు. జయమల్లు అతణ్ణి మరేదో అడగబోయేంతలో, వెనకవైపు నుంచి పెద్ద కలకలం వినబడింది. చప్పున అందరూ అటుకేసి తిరిగిచూశారు. దూరంగా చెట్లచాటు నుంచి తమ కేసే వస్తున్న సైనికులు కొందరు వాళ్ళకు కనిపించారు.

"వాళ్ళింకా మనను చూడలేదు. మనం ఎటు పారిపోయేందుకూ అవకాశంవున్నట్టు లేదే!" అంటూ కేశవుడు విల్లంబులు చేతికి తీసుకున్నాడు. కోయయువకుడు అతణ్ణి వారిస్తూ, "అంతమందితో మనం యుద్ధం



చెయ్యలేం. అదుగో, ఆ కనబడే గుహల్లో ఎక్కడైనా దాక్కుందాం," అంటూ కొండ కేసి బయలుదేరాడు.

అందరూ చెట్లచాటున నక్కుతూ, ముందుకు కదిలారు. ఎదురుగా కొండ పాదంలో వాళ్ళకు చాలా గుహలు కనిపించినై. సైనికులు తమ కోసం ఆ గుహలు వెతకటం ప్రారంభిస్తే, తాము బోనులో చిక్కిన ఎలుకల్లా దొరికిపోతారు. ముసలి వాడు ఈ అనుమానాన్ని కోయయువకులకు చెప్పాడు. వాళ్ళనూ యిలాంటి అనుమానమే బాధిస్తున్నది. చెట్లచాటున దాక్కునే అవకాశంలేదు. తమను అన్ని వైపుల నుంచీ సైనికులు చుట్టుముట్టుతున్నట్టున్నది. బహుశా, వాళ్ళు గుహల్లో తమ కోసం వెతికేందుకు వస్తున్నారు. అదృష్టమల్లా, ఇంతవరకూ తాము వాళ్ళ కంట బడకపోవటం!

హఠాత్తుగా ముందు నడుస్తున్న కోయ యువకుడు ఆగిపోయాడు. అతడి మార్గానికి ఎదురుగా వున్న ఒక రాతి చాటు నుంచి, ఒక నక్క ఎగిరి దూరంగా దూకింది. ఆ వెంటనే రెండు చిన్నపిల్లలు దాని కేసి పరిగెత్తినై. కోయయువకుడు బాణం తీసి, తల్లి నక్కను దూసుకుపోయేట్టు వదిలాడు.



అది వెనక్కు తిరిగిచూడకుండా, ఎదురుగా వున్న గుహల్లో ఒకదాని కేసి దౌడుతీసింది.

"అదృష్టం కొందికీ మనకి నక్క ఎదురైంది. అది ప్రవేశించిన గుహ చూశారు గదా? మనం కూడా దాంట్లోకే వెళదాం," అన్నాడు కోయయువకుడు.

"సైనికులు ఆ గుహలన్నీ గాలించేందుకే వస్తున్నారు," అన్నాడు జయమల్లు.

"వస్తే ఏం? మనం ఆ గుహలో వుండం గదా! శత్రువు నుంచి పరిగెత్తే నక్క ఏదీ, పారిపోయేందుకు మరోమార్గంలేని గుహలో ప్రవేసించదు. పైగా, ఇది పిల్లలనక్క!" అన్నాడు కోయయువకుడు.





కేశవుడూ, అతడి ముసలితండ్రీ, జయమల్లూ పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళు కోయయువకుల వెంట పరిగెత్తి గుహలో ప్రవేశించారు. గుహ అంతా చిమ్మచీకటిగా వున్నది. ఎక్కడా వెలుగు లేదు. కోయయువకుడి ఊహ తప్పని ఆ ముగ్గురూ భావించారు.

"గుహలోనుంచి బయటికి పోయేందుకు మరోమార్గం వున్నట్టులేదే?" అన్నాడు జయమల్లు నిస్పృహగా. కోయయువకు లిద్దరూ మెల్లిగా ఏమో మాట్లాడుకోసాగారు. కేశవుడు, గుహలో నుంచి తల బయటికిపెట్టి అన్నివైపులకూ కలయచూశాడు. సైనికులూ, వాళ్ళకు దారిచూపుతున్న ఆటవికులలా గుహల కేసే వస్తున్నారు.

కేశవుడు చప్పున వెనుదిరిగి ఏదో అనబోయేంతలో, కోయయువకుడి చేతిలో కాగడా గప్పున వెలిగింది. అతడు, జయమల్లు కేసి తిరిగి, "నక్క యింకా ఈ గుహలోనేవున్నదని మీ అనుమానమా?" అంటూ నవ్వి, "అది వెళ్ళినమార్గానే మనం పోవలసివుంటుంది," అంటూ ముందుకు కదిలాడు. అందరూ కలిసి గుహలో ఓ ఇరవై అడుగుల దూరం నడిచే సరికి, హఠాత్తుగా పెద్దగాలి తాకి, కోయయువకుడి చేతిలోని కాగడా గుప్పుమంటూ ఆరిపోయింది.

"చూశారా, గుహ నుంచి బయటికి పారిపోయేందుకు మార్గం ఎక్కడవున్నదో తెలిసిపోయింది." అంటూ కోయయువకుడు పక్కకు రెండడుగులు వేసేసరికి, పైనుంచి పెద్ద వెలుగు అతడి మీద పడింది. అతడు తతిమ్మా వాళ్లకు సౌంజ్ఞచేసి, అక్కడవున్న రాళ్ళ ఆధారంతో పాకుతూ, పైనున్న కంత అంచును గట్టిగాపట్టుకుని, ఒక్క ఊపులో పైకి వెళ్ళిపోయాడు. మిగిలిన నలుగురు కూడా అతణ్ణి అనుసరించి, గుహలో నుంచి వున్న రహస్య మార్గంకుండా త్వరత్వరగా బయటికి వెళ్ళారు.

అక్కడ కొండ మీద నిలబడిచూస్తే, ఆ ప్రదేశమంతా నిర్జనంగా కనిపించింది. దూరంగా దిగువున ఒక నది ప్రవహిస్తున్నది. ఆ నదిలోకి చొచ్చుకు వచ్చిన ఒక కొండా, దాని మీది నుంచి నదిలోకి పడుతున్న ఒక జలపాతమూ వాళ్ల కంటబడింది.

"ఆ జలపాతం చాటున ఒక సొరంగం వున్నది. ఆ సొరంగం నీటి మార్గాన కొద్ది దూరం ప్రయాణించి, అవతలవున్న నది పాయను చేరవచ్చు. అది దాటితే కపిల రాజ్యం!" అన్నాడొక కోయయువకుడు.

అంతలో రెండవ కోయయువకుడు చిన్నగా అరిచి, "చూడండి, చూడండి! అదుగో, ఆ నది ఒడ్డున, గుట్టల చాటుగా సైనికుల శిబిరాలు కనిపిస్తున్నవి," అన్నాడు.

అందరూ అటుకేసి చూశారు. నది అంచున పదీ పన్నెండు డేరాలు వున్నవి. వాటి ముందు ఒక పెద్ద ఈటె పట్టుకుని ఒక సైనికుడు నిలబడివున్నాడు.

"సైనికులందరూ మన కోసం కొండలూ గుట్టలూ గాలించేందుకు వెళ్ళినట్టున్నది. ఆ ఒక్కడే కాపలా కాస్తున్నాడు. వాణ్ణి హత మార్చితే, మనం నదిని నిరాటంకంగా దాటవచ్చు," అన్నాడు కేశవుడు. అవునన్నట్టు అందరూ తలలువూపారు. కేశవుడు రొండిన



వేలాడుతున్న చిన్న కత్తిని ఒరలో నుంచి లాగి, పిల్లిలా ఆ సైనికుడి కేసి నడవసాగాడు. సైనికుడి దృష్టి మరోవైపుకు మళ్ళివున్నది.

కేశవుడికి వెనకగా అందరూ బయలు దేరారు. ఒక్క బాణం దెబ్బతో సైనికుణ్ణి చంపవచ్చు. కాని, చచ్చేముందు వాడు కేకవేస్తే, తమ ఉనికి వాడి అనుచరులకు తెలిసిపోతుంది. వాణ్ణి కిక్కురు మనకుండా తుదముట్టించాలి!

అందరూ యిలా ఆలోచిస్తూ, చడీ చప్పుడూ లేకుండా రాళ్లచాటున నక్కుతూ వెళుతున్నారు. ఇంతలో కేశవుడు కాపలా సైనికుడి వెనకవున్న బండరాయిని చేరి,



దాని వెనక నుంచి, ఒక్క వూపులో పైకెగిరి, సైనికుడి మెడకేసి కత్తి విసిరాడు. సైనికుడు కిక్కురుమనకుండా దుంగలా ముందుకు పడిపోయాడు.

కేశవుడు లేచి నిలబడ్డాడు. అక్కడికి సుమారు నూరుగజాల దూరంలో నదీ తీరం వున్నది. తీరాన నాలుగైదు దోనె పడవలు నీటిలో తేలియాడుతున్నవి. కేశవుడు చేయి ఊపగానే అందరూ బిలబిల మంటూ నదీ తీరానికి పరిగెత్తారు.

"అందరం కలిసి ఒకే దోనెలో వెళ్ళటం మంచిది. నదిలో కొన్నిచోట్ల సుడిగుండాలు వున్నవి. కాళీగా వున్న దోనె నొకదానిని ముందుకుతోస్తూ, వెనగ్గా మనం వెళ్ళాలి. అంత ప్రమాదం జరిగేటట్టుగావుంటే, అందరం నదిలో దూకి ఈదక తప్పదు," అన్నాడు కోయయువకుడు.

ఆ విధంగానే, అందరూ ఒక దోనెలో ఎక్కి కూచుని, మరొక దోనెను పెద్ద గడ కర్రతో ముందుకుతోస్తూ, జలపాతం వైపుకు కదిలారు. నదిలో చాలా సుడిగుండాలు వున్నమాట నిజం. అలాంటి ప్రదేశాల్లో ముందున్న దోనె చిక్కుకునే సమయానికి, దాన్ని పక్కకు నెడుతూ, తమ పడవ వాటిల్లో చిక్కుకోకుండా జాగ్రత్తపడుతూ, కొద్దిసేపటికల్లా జలపాతాన్ని సమీపించి, ఒక్క వూపులో దాని వెనకవున్న సొరంగ మార్గాన్ని చేరారు.

సొరంగ మార్గంలో నదీ జలం విపరీత మైన వేగంతో ప్రవహిస్తున్నది. జలపాతంలో నుంచి వెళ్ళేప్పుడు పడలో వున్నవాళ్లందరూ పూర్తిగా తడిసిపోయారు. "ఈ సొరంగం అంచులకు తగిలి దోనె ముక్కలు చెక్కలు కావటం తథ్యం," అన్నాడు ముసలివాడు. అంతలో ముందున్న కాళీ దోనె, సొరంగం అంచులకు గుద్దుకుని పెళపెళ మంటూ విచ్చిపోయింది. ఇంతలో కేశవుడూ వాళ్ళున్న దోనె, దానిని వేగంగా తాకి తల

కిందులైంది. దోనెలో వున్నవాళ్ళందరూ నదీ ప్రవాహంలో పడిపోయారు. "జ్యేష్ఠా, కనిష్ఠా! మీరెలావున్నారు? మన కోయ అనుచరులు క్షేమమా!" అంటూ కేశవుడి ముసలితండ్రి పెద్దగా కేకపెట్టాడు. ఆ కేకకు జవాబుగా ఒకేసారి నాలుగు గొంతులు పెద్దగా పలికినై. "అయ్యా, నువ్వు ఈదగలవా? సహాయంకావాలా?" అంటూ కేశవుడు తన తండ్రికేసి రాబోయాడు.

"కనిష్ఠా! యిక్కడ అయ్య ఎవరు?" అంటూ ముసలివాడు కస్సుమని, "శిష్యులూ, కోయ గడేబంగ్ అనుచరులూ! అంతా సొరంగం అంచునున్న గండశిలలకు తగలకుండా జాగ్రత్తగా ముందుకు పదండి. ఈ మౌనానందుడు గజ ఈతగాడు; ఏం భయంలేదు," అన్నాడు.

నాలుగైదు నిమిషాలకాలం సొరంగ జలంలో ఈదిన తరవాత హఠాత్తుగా అందరూ నీటి ఉరవడి వల్ల ముందుకు నెట్టబడ్డారు. "ఈ వైపునా మరో జలపాతం వున్నట్టున్నది. మనం..." అంటూ కేశవుడు కీచుమన్నాడు.

సొరంగ మార్గాన ప్రవహిస్తున్న నీరు, ముప్పై నలభై అడుగుల ఎత్తు నుంచి కింద వున్న నదిలోకి హోరుమనే శబ్దంతో పడుతున్నది. కేశవుడూ అతడి అనుచరులూ అంత ఎత్తు నుంచి దభీమంటూ నదిలోకి పడిపోయారు.

ఒక్క క్షణకాలం అందరికీ ప్రాణాలు కడబట్టినంత పనయింది. ఆ వెంటనే తెప్పరిల్లి ఒకరినొకరు పేరుపేరునా పిలుచుకుని, అందరూ సురక్షితంగా వున్నట్టు తెలుసుకుని, నది అవలి తీరానికి ఈదసాగారు.

బాగా అలిసిపోయి, ప్రాణాలు సొమ్మసిల్లివున్న ఆ అయిదుగురూ, తీరాన్ని సమీపిస్తూనే, దాని అంచున కత్తి కఠార్లు పట్టుకుని తమ కేసే చూస్తున్న కొందరు అటవికుల్ని చూశారు. —(ఇంకా వుంది.)



# నాగమణి

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఏదైనా అపూర్వమైన లాభం కోరి ఇలా శ్రమ పడుతున్నావేమో! చాలా ప్రమాదం సుమా. నాగమణి కోరిన వైశ్య కన్యలాగా అవుతావు. నీకు శ్రమ తెలియ కుండా ఉండగలందులకు ఆ కథ చెబు తాను విను," అంటూ ఈ విధంగా చెప్ప నారంభించాడు:

ఒక నగరపు ప్రాకారం వెలపల ఒక పవిత్రమైన మర్రి చెట్టుండేది. దాని అడు గున తొర్రలో ఒక తాచుపాము ఉండేది. ప్రతి ఉదయమూ ఆ పాము తొర్రలో నుంచి బయటికి వచ్చి, చెట్టుకు సమీపంగా ఎండలో చుట్ట చుట్టుకుని పడుకునేది. నగర ప్రజలు భక్తితో ఆ పాముకు పాలూ, ఇతర అరగిం పులూ తెచ్చి పెట్టేవారు.

## బేతాళ కథలు







ఆ నగరంలోనే మహా ధనికుడైన రత్నవర్తకుడుండేవాడు. ఆయనకు అందగత్తె అయిన కుమార్తె ఉండేది. ఆమెకు రత్నాలంటే అమితప్రీతి. అందుచేత ఆమె అంతులేని రత్నాలను పోగుచేసి, వాటిని చూసి మురిసిపోతూ ఉండేది. అయినా ఆమెకు సంతృప్తి లేదు. ఎందుచేతనంటే అమె దగ్గిర ఎన్నో మణు లున్నప్పటికీ వాటిలో నాగమణి లేదు. నాగమణి ఉత్తమ జాతి పాముల తలలపై ఉంటుంది. అటువంటి నాగమణిని తలచుకున్నప్పుడల్లా రత్నవర్తకుడి కుమార్తెకు తన వద్ద ఉన్న మణులన్నీ పట్టి గాజుముక్క లనిపించేది. ఆమె మనస్సు తనకు లభ్యంకాని నాగమణి కోసం తహతహలాడిపోయేది.

ఇలా ఉండగా అమె ఒకనాడు ఊరి వెలపల ఉండే పామును గురించి విన్నది. అది దేవ సర్పం. దాని పడగపైన మణి ఉంటుంది. అది విచ్చలవిడిగా పగటివేళ తన తొర్రలో నుంచి బయటికి వచ్చి ఎండలో చుట్ట చుట్టుకుని పడుకుంటుంది. భక్తి గల వారు దానికి పాలుకూడా పోస్తారు.

వర్తకుడి కూతురు నాగమణి మీది లోభంతో ఒక తక్కువ జాతివాణ్ణి పిలిచి, "రాత్రివేళ నీవు ఊరి వెలపల ఉండే మర్రి చెట్టు వద్దకు వెళ్ళి, పామును చంపి, దాని నెత్తిన ఉండే మణిని తీసుకురా. మంచి బహుమానం ఇస్తాను," అన్నది. వాడలాగే చేసి నాగమణిని తెచ్చి వర్తకుడి కుమార్తెకిచ్చాడు. నాగమణి చేతికి అందగానే ఆమె తన జన్మ తరించినట్టు భావించి, ఇతర మణులను లెక్కచేయక ఈ నాగమణిని తన పాపిట బొట్టుగా ధరించసాగింది.

తన జాతికి చెందిన సర్పం హత్య అయినట్టు విని, నాగరాజైన వాసుకి మండిపడి, ఈ హత్యకు ప్రతిక్రియ జరప నిర్ణయించుకున్నాడు. అతను మనిషిరూపం ధరించి ఆ నగరానికి వచ్చాడు.

నగరంలో ఆచూకీ తీయగా ఫలాని రత్న వర్తకుడి కుమార్తె వద్ద నాగమణి ఉన్నదని తెలియవచ్చింది.

అప్పుడు వాసుకి తానుకూడా రత్నవర్తకుడి వేషం ధరించి, అందగాడైన యువకుడుగా తయారై, రత్న వర్తకుడి ఇంటి పరిసరాలలోనే ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, మహా వైభవంగా జీవిస్తూ, కనిపించినవారినెల్లా ఆహ్వానించి బ్రహ్మాండంగా విందులు చేస్తూ, "నేను రత్న వ్యాపారం చేస్తూ దేశ దేశాలూ తిరుగుతాను," అని అందరితోనూ అన్నాడు.

క్రమంగా వాసుకితో రత్న వర్తకుడికి కూడా పరిచయమయింది. ఆ యువకుడి సిరిసంపదలూ, ఔదార్యమూ చూసి రత్న వర్తకుడు ముగ్ధుడైనాడు. తరవాత వాసుకి రత్నవర్తకుడికి ఎన్నో రత్నాలు బహుమానంగా ఇచ్చి, చిట్టచివరకు, "మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చెయ్యండి," అని కోరాడు. మూడులోకాలూ గాలించినా తనకు ఇంతకంటె మంచి అల్లుడు దొరకటం అసంభవ మనుకుని రత్నవర్తకుడు సరే నన్నాడు.

వర్తకుడి కుమార్తె తనకు భర్త కాబోయే యువకుడి ఘనతను గురించి అదివరకే



విని ఉన్నది. ఆమె అతన్ని కిటికీలో నుంచి చూసి ఆనందపారవశ్యంలో మునిగిపోయి, అతనికి భార్య అయితే తాను తరించినట్టే ననుకున్నది.

రత్న వర్తకుడు తన కుమార్తెకు పెళ్ళి ముహూర్తం నిశ్చయించి, భారీ ఎత్తున పెళ్ళి ప్రయత్నాలు ఆరంభించాడు.

వాసుకి పెళ్ళికూతురికి విడవకుండా రోజూ బుట్టెడేసి రత్నాలు బహుమానంగా పంపుతూ వచ్చాడు. వాటిని చూసి పెళ్ళికూతురికి మతేపోయేది.

అనుకున్నప్రకారం పెళ్ళి వైభవంగా జరిగింది. భార్యా భర్తలను గదిలోకి

పంపారు. రాత్రి గడిచింది. మర్నాడు తెల్లవారుజామున నూతన దంపతులను మేల్కొలపటానికి మంగళతూర్యాలు వాయించారు.

జాము పొద్దెక్కినా గదిలో నుంచి పెళ్ళికూతురుగాని, పెళ్ళికొడుకుగాని బయటికి రాలేదు.

వర్తకుడి బంధువులు కంగారుపడి గది తలుపులు పగలగొట్టి లోపల ప్రవేశించి చూసేసరికి పెళ్ళికూతురు పక్కమీద చచ్చి పడి ఉన్నది. ఆమె శరీరంపైన రెండు సన్నటి కాట్లున్నాయి.

పెళ్ళికొడుకు జాడ అసలే లేదు. కాని తలుపు పగలగొట్టగానే గదిలో నుంచి ఒక నల్లటి పాము గబగబా బయటికి వెళ్ళిపోవటం కనిపించింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. వర్తకుడి కుమార్తెకు మణులకు ఏవిధమైన కొరతా లేదుగదా, నాగమణి కోసం ఎందుకంతగా తహతహలాడి తన ప్రాణానికే ముప్పు తెచ్చుకున్నది. నాగమణిలో ప్రత్యేకమైన విలువగాని, మహిమగాని, లేక అపూర్వమైన శక్తులుగాని ఏవైనా ఉన్నవా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నాగమణిలో నిజానికి ప్రత్యేకత ఏమీలేదు. ఒకవేళ ఉన్నప్పటికీ, వర్తకుడి కుమార్తె దానికోసం తహతహలాడి పోవటానికి కారణం దాని విలువగాని, మహిమగాని కానేకాదు. ఇతర మణులు కొల్లలుగా ఉన్నప్పటికీ నాగమణి తన వద్ద లేని కారణంచేతనే ఆమె దానిని అంత గాఢంగా వాంఛించింది. స్త్రీలు సులభ సాధ్యం కాని వాటికి హెచ్చు విలువ ఇస్తారు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# మణి మహాత్మ్యం

వరాషీద రాజ్యానికి ప్రభువు సారంగధరుడు. ఆయనకు ధవళకాంతుడు, ప్రవళకాంతుడు అని యిద్దరు కొడుకులు. ఆ రాజు దగ్గర ఉండే మంత్రికి రత్నావతి అనే కూతురున్నది. ధవళకాంతుడికీ రత్నావతికీ చిన్నప్పటి నుంచీ స్నేహం. ఇద్దరికీ యుక్త వయస్సు వచ్చేసరికి రత్నావతి ధవళకాంతుణ్ణి తప్ప మరెవ్వరినీ పెళ్ళాడనని పట్టుపట్టింది. ఈ మాటకు అందరూ హర్షించారు. సుముహూర్తంకూడా నిశ్చయమైంది.

ఒకనాడు ధవళకాంతుడు ఉద్యానవనంలో ఉండగా, దురదృష్టవశాత్తు ఒక విషసర్పం కరిచింది. విషం ఎక్కి రాజకుమారుడి శరీరం నల్లబడిపోయింది. వైద్యులు వచ్చారు. ఆ విషాన్ని విరిచి, రాజకుమారుణ్ణి బతికించారు. అపాయం తప్పింది కదా అని అందరూ సంతోషించారు. రాజ్యంలో ఉత్సవాలు జరిగినై.

కాని, వైద్యులకుకూడా తెలియకుండా ఒక చిన్న విషబిందువు ఎలానో ధవళకాంతుడి దేహంలో మిగిలిపోయింది. అతని ఒళ్ళంతా మళ్ళీ నీలంగా మారింది. దుర్వాసన పుట్టింది. చూపు మందగించింది. భరించరాని బాధతో మంచం పట్టాడు.

ఇప్పుడు దేశదేశాల నుంచి ఘనవైద్యులెంతో మంది వచ్చి పరీక్ష చేశారు. వారు నిరాశచేసుకుని, ఆఖరు మాటగా ఇలా అన్నారు: 'దీనికి ఒకే ఒక మందు వుంది. మానస సరోవరం దాటినాక హిమాలయాల దగ్గర కృష్ణవనంలోని 'అమృతవల్లి' అనే మూలిక తెచ్చి, దాని రసం ప్రయోగిస్తే, పూర్తి ఆరోగ్యం కలుగుతుంది. అయితే— ఈ పని మూడు నెలల లోగానే జరగాలి. దాటితే లాభం లేదు,' అని చెప్పారు.

కాని, అక్కడికి ఎవరు పోగలరు? ఎవరు తేగలరు? అసాధ్యమైన సాహస

ఎం. విశ్వనాథం



కార్యమయిందే? అందుచేత' అందరూ మొఖమొఖాలు చూచుకున్నారు.

ఈ స్థితిలో, అన్న మీద ప్రేమగల ప్రవళ కాంతుడు—'ఎవరో ఎందుకు? నేనే పోయి, ఆ మూలిక తెస్తాను. నా అన్నను బతికిస్తాను,' అని చెప్పి బయల్దేరాడు.

అతను వచ్చేదాకా ధవళకాంతుణ్ణి కాపాడాలి కదా. దాసదాసీలు వుంటున్న మాట నిజమే. కాని, శ్రద్ధగా చూడటానికి వాళ్ళకేమంత పట్టింది?

. ఈ సమయంలో రత్నావతి ముందుకు వచ్చి, 'ఆయనే నాకు భర్త. ఏనాడో నిశ్చయించుకున్నాను. కనుక, నేనే దగ్గరవుండి ఆయనకు అవసరం అయిన సేవ చేస్తాను,' అని బతిమలాడింది.

అందుకు రాజూ,రాణీ—'వద్దమ్మా! పిల్లవాడి స్థితి చూడబోతే అనుమానాస్పదంగా వుంది. మూడు నెలల లోపల ఆ మూలిక రావడం, ఆ రసం ప్రయోగించడం ఎక్కడి మాట? అంతా దైవబలం మీద ఆధారపడి వుంది. అయినా, సేవకులే అసహ్యపడుతున్న ఈ పనికి నువ్వెందుకు రావటం!' అన్నారు.

రత్నావతి పట్టు వదలలేదు. అందుచేత ఆమె కోరికను వప్పుకోవలసి వచ్చింది. అప్పటినుంచీ రత్నావతి మరెవ్వరినీ అక్కడికి రానివ్వక, తనే రాజకుమారుడి సేవ చేస్తూండేది. ఇప్పుడు సేవకులకూ, బాధ తప్పినందువల్ల సంతోషంగా వుంది. రాజూ రాణీ కూడా కొడుకు పరిచర్యను గురించి నిశ్చింతగా వున్నారు.

ఆ మందగించిన దృష్టితోనే రాజకుమారుడు, తన దగ్గర ఉండి సేవ చేస్తూన్నది రత్నావతే అని తెలుసుకుని చాలా బాధ పడ్డాడు. తన ఆశ వదులుకోమని ఎంతో చెప్పిచూశాడు. కాని, ఆమె నిశ్చయం తెలిసినాక ఏమీ అసలేక పోయాడు. అతడికి మేలు కలగాలని మహారాణీ, రత్నావతీ చేసే

ప్రార్థనలతోనూ, వారి ప్రతోపవాసాలతోనూ కాలం గడుస్తూన్నది.

* * *

ప్రవళకాంతుడు వాయువేగంతో గుర్రాన్ని దౌడు తీయించి, ఒక నెల రోజులలో హిమాలయాలు చేరుకున్నాడు. ఎదురుగా కనబడే మానస సరోవరం ఎలా దాటడమా అని ఆలోచిస్తూ, ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

ఆ చెట్టు పైన గండభేరుండ దంపతులు మాటాడు కోవటం రాజకుమారుడుకి వినిపించింది. ఆడపక్షి దుఃఖిస్తూ, 'అయ్యో, మన గుడ్లను ప్రతిసారీ ఈ ఘటసర్పం మింగిపోతూంది కదా. ఎక్కడ దాచినా, పక్షం రోజులైనా తిరక్కుండా, పిల్లల్ని కబళించివేస్తుందే! ఈ సర్పాన్ని చంపే ఉపాయం లేదా? మన సంతానాన్ని కాపాడుకునే మార్గమే లేదా?' అని భర్తతో చెప్పింది.

అందుకు మగపక్షి, 'ఈ క్రూర సర్పం మనకే కాదు చెరుపు చేస్తూవుంటు. ఏ పాపమూ ఎరగని, మాషీద రాజకుమారుడు ధవళకాంతుణ్ణి కరిచి వచ్చింది. అతడు మరణావస్థలో వున్నాడు. అతని కోసం అమృతపల్లి మూలికను తీసుకుపోవటానికి అతని తమ్ముడు వచ్చివున్నాడు. ఆ మూలిక చుట్టూ ఈ ఘటసర్పమూ, భయంకరమైన మరి ఎన్నో ఇతర సర్పాలూ వున్నాయి.





ఈ పసివాడేం చేయగలడో, 'యేమో!' అన్నది. ఈ మాటలు విన్న ప్రవళకాంతుడు ఆ పక్షులకు నమస్కరించి, 'పక్షి దంపతులారా!—మీ దుస్థితికి నేనూ ఎంతగానో విచారిస్తున్నాను. ప్రాణానికైనా తెగించి, నేను ఆ అమృతవల్లి మూలికను సాధించి తేవాలి: ఆ ఘటసర్పం కంటపడిందో, నా ఖడ్గానికి బలి అయిందనే నమ్మండి!' అని ధైర్యం చెప్పాడు.

అప్పుడు పక్షి దంపతులు, 'రాజకుమారా! అది సులువైన పని కాదు సుమా! ఆ సర్పానికి ఒక వరమున్నది— పగవాణ్ణి చూస్తే దానికి రెండింతలు బలం వస్తుంది. అది తాటిచెట్టంత పెరిగి, గొప్ప శక్తితో విజృంభిస్తుంది. ఒక్కసారి అది భుస్సుమంటే, ఎంతటి బలవంతుడైనా చచ్చిపోవలిసిందే. అందుకనే, అమృతవల్లి సంపాదించటం నీకు సాధ్యమయే పని కాదన్నాము,' అని చెప్పినై.

'అది మీరు చెప్పినంత అసాధ్యకార్యమే కావచ్చు. అయితే, పుట్టిన ప్రతి ప్రాణికీ చావు తప్పదు కదా. అందుచేత, ఈ ఘటసర్పంకూడా ఎప్పుడో ఒకప్పుడు చావవలిసిందే!' అన్నాడు ప్రవళకాంతుడు.

రాజకుమారుడి సాహసానికీ, పట్టుదలకూ మగ గండభేరుండపక్షి చాలా సంతోషించింది. 'అయితే, రాజకుమారా!—ఒక చిన్న రహస్యం చెబుతా, విను: మా జాతి పక్షుల ఎంగిలి ఆ సర్పం కడుపులోకి ఏ విధంగా వెళ్ళినా సరే, దానికి మరణం తప్పదు. ఈ కారణం చేతనే అది మమ్మల్ని నిస్సంతుచేసి, తను అమరత్వం పొందాలనే వుద్దేశంతో మా కుటుంబాన్ని నాశనం చేస్తున్నది,' అని చెప్పింది.

ఈ మాట వినగానే ప్రవళకాంతుడు ఒక యుక్తి పన్నాడు. ఆ సమీపంలో ఒక ఋష్యాశ్రమం, ఆశ్రమంలో కొన్ని ఆవులూ కనిపించేసరికి, అక్కడికి పోయి ఒక చట్టితో

కొంచెం పాలు తెచ్చాడు. ఆ పాలు పక్షుల వద్దకు తీసుకువెళ్ళేసరికి, అవి వాటిని ఎంగిలి చేశాయి. పైగా, ఆ చట్టి ఫలానచోట పెట్టమని చెప్పి, ఒక జాగా ఆనవాలు చూపించినై. అవి చెప్పినట్టే చేసి, రాజకుమారుడు చాటున దాక్కున్నాడు.

అది ఆ ఘటసర్పం రోజూ వచ్చిపోయే దోవ. మామూలు వేళకు అది వచ్చింది. చట్టిలో పాలు చూడగానే ఆశపడి, అవన్ని ఒక్కగుక్కలో తాగేసింది. వెంటనే అది తాటిచెట్టంత పెరిగి, విరుచుకుపడి చచ్చింది.

జన్మశత్రువైన ఘటసర్పం ఇలా చచ్చి పడిపోవటంతో గండభేరుండాలు అంతులేని సంతోషంపొందినై. ప్రపళకాంతుణ్ణి పిలిచి, 'రాజకుమారా!—ఇక నీ కార్యం జయమైనట్టే. ఈ సర్పం తల చీల్చి, లోపలవుండే కాంతివంతమైన మణిని తీసుకో. ఒక కొయ్య తెప్ప తెచ్చి, సరోవరంలో వదిలి, దాని పైన కూర్చో. ఒక తాడు పేని దాని మధ్య భాగం పట్టుకో. దాని చెరివక చివరని పట్టుకుని, మేం ఎగురుతూ నిన్ను అవతలి ఒడ్డుకి చేరుస్తాం. ఆ మణియొక్క కాంతిలో నువ్వు చీకటిగా వుండే కృష్ణవనం ప్రవేశించి, మూలికను తెచ్చుకో. ఈ కాంతి కనబడినంత మేర అక్కడి సర్పాలు నిన్నేమీ చెయ్యలేవు,' అని చెప్పాయి.





ప్రవళకాంతుడు సరిగ్గా అవి చెప్పినట్టే చేశాడు. వైద్యులు చెప్పిన లక్షణాలు గల అమృతవల్లిని చేతపట్టుకుని, పక్షి దంపతుల సహాయంతో ఇవతలకు వచ్చాడు.

పక్షి దంపతులు మళ్ళీ ప్రవళకాంతుడితో, 'రాజకుమారా!—సమయం మించకుండా ఇంటికిపోయి, నీ అన్నను బతికించు. నీ శ్రమసార్థకమవుతుంది. ఈ మణి గొప్ప మహిమ కలది. దాని కీలకాన్ని చెబుతాం. తెలుసుకుని మేలుపొందు: దీన్ని తాకితే, అనారోగ్యులు ఆరోగ్యవంతులవుతారు. ఇది ఎప్పుడైనా ఒకవేళ నల్లబడిందనుకో, నువు చెయ్యవలిసిన కర్తవ్యాన్ని నీకు సూచిస్తున్నదని తెలుసుకో!' అంటూ, పక్షులు ఎగిరిపోయినై.

* * *

గడువుకు ముందే ప్రవళకాంతుడు ఇల్లు చేరుకున్నాడు. ధవళకాంతుడికి వైద్యులు అమృతవల్లి చికిత్స ప్రారంభించారు.

రాజకుమారుడు ఎప్పుడు ఆరోగ్యవంతుడవుతాడా, ఎప్పుడు చూస్తానా అని తపించిపోతున్న రత్నావతి సంతోషం చెప్పతరం కాదు. లోపల వుండి, ఆమె ధవళకాంతుడికి శుశ్రూష చేస్తూనేవుంది. అయినా, అందరూ రాజకుమారుణ్ణి గురించిన బెంగతో ఉండటంవల్ల, ఆమె సంగతి ఎవళ్ళూ పట్టించుకోలేదు.

ఇప్పుడు రత్నావతి గబగబా స్నానాల గదికిపోయి నిలువుటద్దం ముందు నించునేసరికి, ముఖమంతా నల్లటి మచ్చలతో వికారంగా కనబడింది. ఒళ్ళు కృశించిపోయి వుంది. తల దువ్వుకుంటే జుట్టు అంతా వూడి రాలిపోయింది. రాజకుమారుడికి ఎక్కిన విషప్రభావం వల్లనే, అతని సేవ చేసిన రత్నావతి ఇలా మారిపోయింది. ఇటువంటి వికృతాకారంతో ఎవరి యెదటా పడటానికి మనస్కరించక, పిట్టకైనా తెలియకుండా ఆమె ఇంటి నుంచి పారిపోయింది

ధవళకాంతుడు మరొక తగిన కన్యను చూసి పెళ్ళాడాలని కోరుకొంటూ, రత్నావతి ఒక దేవాలయం ముందు భిక్షుకిగా కూర్చుంది. అయితే, రూపమంతా మారి పోవటంవల్ల ఎవరూ ఆమెను గుర్తించలేదు.

రెండు రోజుల్లో ధవళకాంతుడు పూర్తి ఆరోగ్యంతో లేచాడు. లేవగానే, 'నా రత్నావతి యెక్కడ? నన్ను కాపాడిన రత్నావతి ఎక్కడ?' అంటూ, తహతహలాడాడు. రత్నావతి అంతు తెలియక, అందరూ ఆమెను వెతుకుతూనే వున్నారు. ఇప్పుడు ధవళకాంతుడు మళ్ళీ రత్నావతిని గురించిన బెంగతో కృంగసాగాడు.

ఇలా వుండగా—ఒకనాటి వుదయం కోనేటిగట్టున దేవాలయపు అర్చకుడికి ఒక ఉంగరం దొరికింది. దానిమీద ధవళకాంతుడి పేరు కనబడేసరికి, అర్చకుడు ఉరకలేసుకొంటూ తెచ్చి, దాన్ని రాజకుమారుడి కిచ్చాడు. అది—లోగడ ధవళకాంతుడు తన ప్రేమ చిహ్నంగా రత్నావతి వేలికి పెట్టిన ఉంగరం!

ఉంగరం కోనేటి గట్టున దొరికిందనగానే రాజకుమారుడి మనసు పరిపరి విధాల పోయింది—'రత్నావతి ఈ కోనేటిలో పడి ఆత్మహత్య చేసుకుని వుంటుంది. ఆమె శరీరం కృశించిపోవటంవల్ల ఉంగరం వేలి



నుండి జారి కింద పడిపోయి వుండాలి. నన్ను కష్టదశలో కాపాడిన రత్నావతే లేనప్పుడు, నేను బతికి ఏం చేయాలి!' అనుకొంటూ, తనుకూడా ఆ కోనేటిలో పడబోయాడు.

అంతలో—ఆ దగ్గరే భిక్షుకిగా వున్న రత్నావతి అడ్డువచ్చింది. 'అయ్యో, ఎంత పని! రత్నావతిని నేనే. బతికే వున్నాను. నా రూపం ఇలా మారిపోయింది. కనుక మీకు తగినదాన్ని కాను. మీరు మరొక సుందరిని వెళ్ళాడి సుఖంగా వుండండి. ఇదే నా కోరిక,' అని వేడుకుంది.

ధవళకాంతుడు ఆమెను గుర్తుపట్టాడు. 'నాకీ రాజ్యమూ వద్దు, ఏమీ వద్దు. నిన్ను రక్షిస్తూ, నీతోనే ఉండిపోతాను. ఇది నాకు విధి. రాజ్యం నా తమ్ముడు చూసుకొంటాడు,' అని విరక్తిగా మాట్లాడాడు.

ఆ సమయంలో ప్రవళకాంతుడు అక్కడనే వుండి, ఇదంతా చూస్తూనే వున్నాడు. అతని చేతిలో మణి నల్లబడిపోయింది! వెంటనే, పక్షి చెప్పిన మణి మహత్యం జ్ఞాపకం వచ్చింది.

'ఇప్పుడు నా కర్తవ్యం ఏదో వుందని ఈ మణి సూచిస్తూన్నది. ఏమిటది? ఊరుకుంటే నేనే రాజునై సుఖించవచ్చు. కాని, అది ద్రోహం అవుతుంది,' అనుకుని మణిని అన్న చేతిలో పెట్టాడు. అప్పుడూ అది నల్లగానే వుంది.

కొంచెం యోచించి దాన్ని రత్నావతి చేతికిచ్చాడు. ఆమె చెయి తగలగానే ఆ మణి ప్రకాశవంతమైంది! ఆమె శరీరానికి పట్టిన వికారాలన్నీ పోయినై. ఆమె సంతోషంతో ఆ మణిని మళ్ళీ ప్రవళకాంతుడికే ఇచ్చింది. ఇప్పుడు మణి నల్లబడలేదు. ప్రకాశిస్తూనే వుంది. రత్నావతి సంతోషమే రాజకుమారుల సంతోషం. కనుక, ఆ క్షణం నుంచీ ధవళకాంతుడి జీవితం కూడా దేదీప్యమానంగా ప్రకాశింపసాగింది.





# తప్పిపోయిన పెళ్ళి

పాపన్న పెళ్ళి చేసుకుని ఒక ఇంటివాడైతే బాగుండునని అతని తల్లి అనుకున్నది. ఎందుకంటే పాపన్న చదువుకున్నాడు, రాజ బహుమానం కూడా పొందాడు, పెళ్ళీడు వాడయాడు.

అయినా ఊళ్ళో వారెవరూ పాపన్నకు పిల్లనిస్తామని ముందుకు రాలేదు. ఎందుకంటే, అతను ప్రయోజకుడన్న నమ్మకం ఎవరికీ కుదరలేదు. ఇప్పటికీ అతను అస్తమానమూ పరోపకారం చెయ్యటంలోనే మునిగి ఉంటున్నాడు గాని తన సొంత వ్యవహారాలేమీ చూసుకోవటం లేదు. అసలు అతను ఇంట్లో ఒక్క క్షణం ఉండడు. అందుచేత పెళ్ళి చేసినా పాపన్న ఇంటి పట్టున పడి ఉండడనీ, పెళ్ళాం కష్టసుఖాలు పట్టించుకోడనీ ఊళ్ళోవాళ్ళు అనుకున్నారు.

పాపన్న కోసం పిల్లలను వెతికించగా వెతికించగా మూడు కోసుల దూరాన ఒక పిల్ల ఉన్నట్టు తెలిసింది. పాపన్న తల్లి తమ ఊరి నుంచి ఒక శాస్త్రుల్లుగారిని పంపి ఆ సంబంధం మాట్లాడించింది. ఆ పిల్ల అందంగానే ఉంటుంది గాని అనాథ. చిన్నతనం నుంచీ ఎవరో శ్రీమంతులు చేరదీసి పెంచారు. వారింట ఆ పిల్ల పనులు చేస్తున్నది. ఆమె పేరు లక్ష్మి. పసితనం నుంచీ పెంచి పెద్ద చేసిన శ్రీమంతులు, ఎవరు తమకు నూరు వరహాలిస్తే వారికా పిల్లనిస్తామన్నారు. వారు కోరినట్టు నూరు వరహాలూ ఇచ్చి అ పిల్లను తెచ్చి తన కొడుక్కు చేసుకోవటానికి పాపన్న తల్లి నిశ్చయించింది.

పాపన్న కూడా తనకు పెళ్ళి కాబోతుందని సంబరపడ్డాడు. అయితే అతనికి పిల్లను ముందుగా చూడాలనిపించింది. కాని ఈ మాట పైకి అంటే అందరూ నవ్వుతారనుకుని, పెళ్ళికూతురికి నగలు కొనే నెపం మీద పట్నానికని బయలుదేరాడు పాపన్న.

పరోపకారి పాపన్న కథలు—4



సంబంధం మాట్లాడి వచ్చిన శాస్తుల్లు గారు పిల్ల చేసే పనులను గురించీ, ఆమె ఉండే శ్రీమంతుల ఇంటి గుర్తులూ అవీ, చాలా చెప్పాడు. లక్ష్మి తెల్లవారుజామునే పశువులకు పాలు తీస్తుంది. ఆ సమయంలో ఆ గ్రామం చేరుకునే ఉద్దేశంతో పాపన్న డబ్బు సంచీ రొండిన కట్టి మూడవ జామునే ఇల్లు కదిలాడు.

పాపన్న సగం దూరం వెళ్ళాడో లేదో అతనికి ఒక బండీ ఎదురయింది. బండి ఒక పక్కగా ఏటవాలుగా నిలబెట్టి ఉన్నది. దానికి ఎద్దు లేదు. బండి పక్కన ఒక యువతీ, యువకుడూ ఉన్నారు. యువకుడు బాధతో మూలుగుతున్నాడు. వాడికి యువతి ఏవో ఉపచారాలు చేస్తూ, కన్నీరు కారుస్తూ, "అయ్యో, ఎంత చిక్కు వచ్చింది! నీవు బండి లాగలేవు. దెబ్బ బలంగానే తగిలింది. ఇప్పుడు మన గతి ఏమిటి?" అని వాపోతున్నది. పాపన్న పరుగున వారిద్దరినీ సమీపించి, "మీ కిప్పుడు వచ్చిన చిక్కేమిటి? నా వల్ల ఏమైనా సహాయం కావాలంటే చెప్పండి. పరోపకారార్థ మిదం శరీరం!" అన్నాడు.

"అయ్యా, నా పేరు రంగడు. మేమిద్దరమూ తెల్లవారే లోపల చాలా దూరం వెళ్ళాలి. ఎద్దు లేక పోవటం చేత నేనే బండి లాగుతూ, చీకట్లో ఎదురు దెబ్బ తగిలి పడ్డాను. గాయమయింది. ఈ బాధ తోనూ, ఈ కాలితోనూ నేనిక బండి లాగ లేను. మేము తెల్లవారే లోగా మా ఊరు చేరకపోతే మా యిద్దరి బతుకూ భ్రష్టయి పోతుంది!" అన్నాడు యువకుడు.

"అందుకు మీరేమీ విచారించ వద్దు. నేను బలశాలిని. నీవు కూడా బండి ఎక్కి నాకు దారి చెప్పు, నేను బండి లాగుతాను," అన్నాడు పాపన్న.

"ఆ పని చేస్తే బతికి పోతాం, బాబూ!" అంటూ ఆ యువతీ యువకులు బండి

ఎక్కారు. పాపన్న బండి లాగుతూ, "మీరిద్దరూ దంపతులా?" అని అడిగాడు.

"మా కింకా పెళ్ళి కాలేదనుకోండి. ఊరు చేరగానే చేసేసుకుంటాం. ఇది ఒక దిక్కులేని పిల్ల. ఒక ధనికుల ఇంట పని మనిషిగా ఉంటున్నది. దీన్ని చిన్నతనం నుంచీ వారే పెంచారు. నేను వాళ్ళ పాలి గింట పని చేస్తూ ఉంటాను. చాలా కాలంగా మేమిద్దరమూ ప్రేమించుకున్నాం. దాన్ని నేను పెళ్ళి చేసుకుంటానని దాని యజమానిని అడిగానుకూడా. నూరు వరహాలిస్తే ఒప్పుకుంటానన్నాడు. నా దగ్గిర నూరు వరహాలు కాదుగదా రెండు వరహాలుకూడా లేవు. అందుచేత ఏమీ చెయ్యలేక పోయా. ఇంతలో పొరుగూరు నుంచి ఎవరో నూరు వరహా లిస్తామని కబురు చేశారు. దీని యజమాని ఒప్పుకున్నాడు. దీన్ని చేసుకో బోయేవాడు ముట్టిబుర్ర అని తెలిసింది. ఈ మాట విని అది ఏడిచింది. మే మిద్ద రమూ రహస్యంగా మా తాతగారి ఊరు పారిపోవటానికి నిశ్చయించుకుని అర్ధరాత్రి వేళ బయలుదేరాం. కాని మధ్యదారిలో న్నాకీ దెబ్బ తగిలింది. ఇంతలో దేవుడల్లే మీరొచ్చి మమ్మల్ని కాపాడారు!" అన్నాడు రంగడు. ఈ కథ అంతా వినకముందే పాపన్న




బండి లాగటం మానేసి నిలబడి పోయాడు. చివర కతను, "ఈ పిల్ల పేరేమిటీ?" అని అడిగాడు. "లక్ష్మి," అని రంగడు చెప్పాడు.

"అయితే మీరు పారి పోవలిసిన అవ సరం లేదు. తిరిగి పోదాం," అంటూ పాపన్న బండిని తిప్పాడు.

"ఉండండి, ఉండండి! మేం ఆ ఊరులో కనిపిస్తే మమ్మల్నిద్దర్నీ చీలుస్తారు!" అని రంగడు విలవిల లాడాడు.

"ఆ ధనికుడికి డబ్బివ్వకుండా లక్ష్మిని ఎత్తుకు పోవటమే అసలైన నేరం! హాయిగా డబ్బు పారేసి, మహారాజులాగా పెళ్ళాడు!" అన్నాడు పాపన్న.

"నా దగ్గిర చిల్లి గవ్వ లేదని, లోగడే చెప్పాగదా," అన్నాడు రంగడు.

"నా దగ్గిర డబ్బున్నది. నీకు కావలిసిన నూరు వరహాలూ నే నిస్తాను, సరేనా?" అన్నాడు పాపన్న.

వారు ముగ్గురూ లక్ష్మి ఉండే గ్రామం చేరే సరికి తెల్లవారి పోయింది.

లక్ష్మి పారిపోయిందని అప్పటికే తెలిసి శ్రీమంతుడు ఉగ్రుడై పులిలాగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. పాపన్న ఆయనతో, "అయ్యా, ఇదుగో నూరు వరహాలు! ఈ రంగణ్ణీ లక్ష్మినీ పెళ్ళాడ నివ్వండి. నూరు వరహాలు ఎవరిస్తే వారికి లక్ష్మి నిచ్చేస్తామన్నారుట గదా!" అన్నాడు.

"నిజమే కాని లక్ష్మిని పాపన్న అనే అతనికి ఇచ్చి చేస్తానని మాట ఇచ్చేశాను. రేపో ఎల్లుండో వారు పైకం తీసుకు వస్తారు. లక్ష్మిని రంగడికిస్తే నేను మాట తప్పిన వాణ్ణవుతాను," అన్నాడు శ్రీమంతుడు.

"ఆ భయం మీ కేమీ వద్దు. ఆ పాపన్నని నేనే. పాపం, వాళ్ళిద్దరూ చాలా కాలంగా ఒకరినొకరు ప్రేమించుకున్నారుట. నేను ఈ పిల్లను కాకపోతే మరొక పిల్లను చేసు కుంటాను," అన్నాడు పాపన్న. రంగడూ, లక్ష్మి పాపన్న కాళ్ళపైన పడి, మట్టిబుర్ర అన్నందుకు క్షమాపణ చెప్పుకున్నారు.

పాపన్నయొక్క పరోపకార బుద్ధి చూసి నాక శ్రీమంతుడికి డబ్బు తీసుకోవటానికి చేతులు రాలేదు. "నాకు డబ్బు అవసరం లేదు లెండి. వాళ్ళిద్దరినీ పెళ్ళి చేసుకో నివ్వండి!" అన్నాడాయన.

"అదేం మాట? మీకు ఈ డబ్బు ఇవ్వలేకనే వాళ్ళిద్దరూ చాలా శ్రమపడ్డారు. డబ్బు తీసుకోండి," అన్నాడు పాపన్న.

శ్రీమంతుడు ఆ డబ్బు తీసుకుని లక్ష్మి చేతికి ఇచ్చేశాడు. వారిద్దరికీ పెళ్ళి చేయించి పాపన్న ఆ రోజే తన ఇంటికి వచ్చేశాడు.

—[ పై సంచికలో మరొక సంఘటన ]







# సదుద్దేశం

"స్నానానికి లెమ్మంటున్నార్రా. మనం కథలు ఇంకొకసారి చెప్పుకుందాంలే," అన్నాడు తాతయ్య.

"ఇంకొక్క కథ చెప్పి వెళుదువుగానిలే, తాతయ్యా!" అన్నారు పిల్లలు.

తాతయ్యకన్కూడా కథ చెప్పాలనే ఉన్నట్టుంది. ఆయన నవ్వుతూ, "తెలివి తక్కువ పనులు చేసేవాళ్ళ కథలు చెప్పానా, అటువంటి పనులు చేసేవాళ్ళలో మంచి ఉద్దేశాలు గల వాళ్ళుకూడా ఉంటారు. నా చిన్నతనంలో జరిగిన సంగతి ఒకటి చెబుతా," అంటూ ప్రారంభించాడు.

మా ధర్మారంలో మునసబుండేవాడు. ఆయనంటే అందరికీ హడలన్నమాట. ఊళ్ళో ఎవరూ ఆయనతో చెప్పకుండా ఊరుదాటి పోరాదు.

అయిందా—మా ఊళ్ళో బుచ్చయ్య అనే కుమ్మరీ, అచ్చయ్య అనే మేదరీ ఉండేవాళ్ళు. ఆ రోజుల్లో గ్రామాల్లో ఇలాటి వృత్తుల వాళ్ళంతా గ్రామ నౌఖర్లన్నమాట. ఊళ్ళో వాళ్ళకి ఏ అవసరం వచ్చినా వీళ్ళు సాయపడాలి. వీళ్ళకు ఊళ్ళోవాళ్ళు వార్షికాలిచ్చేవాళ్ళు. అదే వాళ్ళ సంపాదన.

ఒకనాడేమయిందంటే మేదరి అచ్చయ్య చిన్న పని మీద పొరుగూరు వెళ్ళవలిసొచ్చింది. కర్మ చాలక ఆ రోజునే బండెయ్య అనే పెదకాపు ఇంట్లో ముసలమ్మ కాస్తా హరీ అన్నది. ఈ బండెయ్య మునసబుకు కావలిసినవాడు. అందుచేత ముసలమ్మ అంత్యక్రియలు మునసబు దగ్గిరుండి చేయించాడు.

శవాన్ని శ్మశానం చేర్చటానికి పాడె కట్టాలిగా? అందుకని మేదరి అచ్చయ్య కోసం మునసబు మనిషిని పంపితే అచ్చయ్య ఊళ్ళో లేడని తెలిసింది. మునసబు శివతాండవం చేసేశాడు. పక్క గ్రామం నుంచి

మరొక మేదరిని పిలిపించి ఎలాగైతేనేం ముసలమ్మ పని పూర్తిచేశారు.

మర్నాడు అచ్చయ్య తిరిగి రాగానే మునసబు అతణ్ణి నానా తిట్లూ తిట్టి, "ఊరు వదిలి పొయ్యేవెళ్ళవు నాతో చెప్పక్కర్లా? ఊరికి ఒక్క మేదరివిగదా, ఎవరికన్నా అవసరం వస్తే తీరా సమయానికి నువు లేక పోతే ఏంగానూ? ఈసారి నాతో చెప్పకుండా ఊరు వదిలివెళ్ళావో నీ పుటం ఆరుతుంది, జాగర్త!" అని గట్టిగా చెప్పాడు.

మరి కొన్నాళ్ళకి ఓరోజున మేదరి అచ్చయ్యా, కుమ్మరి బుచ్చయ్యా కలిసి పట్నం వెళ్ళాలిసొచ్చింది. చెప్పకుండా పోతే మునసబు చంపడూ? అందుకని, ఊరి కెళుతున్నామని చెప్పటానికి మునస బింటికి వెళ్ళారు. కాని మునసబు ఇంటో లేడు. ఆయన భార్యకు కొంచెం సుస్తీగా ఉంటే పెద్ద వైద్యుడి కోసం పట్నం వెళ్ళాడు.

ఏంచెయ్యాలో వాళ్ళకు పాలుబోలేదు. మునసబుతో చెప్పిపోదామంటే మునసబు ఊళ్ళో లేడు. బుచ్చయ్య అచ్చయ్యలకు పట్నంలో అర్జెంటు పనే ఉన్నది. అందుకని చెప్పకుండా పోతే ఏ పెద్ద ఇంటివాళ్ళకేం అవసరం వస్తుందో.

ఇద్దరూ చాలాసేపు వితర్కించుకున్నాక బుచ్చయ్య ఉపాయం కనిపెట్టాడు.



"మనూళ్ళో ఉన్నవే నాలుగు మోతుబరి లోగిళ్ళు. ఆ నాలుగిళ్ళ ముందరా నాలుగు పాడెలూ, నాలుగు కొత్త కుండలూ పెట్టి మనం మన దారిన వెళదాం. ఎవరికి అవసరమొచ్చినా పని గడిచిపోతుంది," అన్నాడు బుచ్చయ్య. "భలే ఆలోచన చేశావులే, బుచ్చయ్యమామా! అలాగే చేద్దాం!" అన్నాడు అచ్చయ్య. ఆ రాత్రికి రాత్రే నాలుగు పాడెలు తయారు చేశాడు అచ్చయ్య. మునసబుగారింటి ముందు ఒక పాడే, ఒక కుండా, చిన్నయ్యగారింటి ముందూ, నాయుడుగారింటి ముందూ, మాసుల్దారుగారింటి ముందూ కూడా ఒక్కొక్క పాడే, కొత్త కుండా పెట్టేసి, వాళ్ళిద్దరూ కోడి కూసే వేళకు బయలుదేరి పట్నం వెళ్ళారు.

వాళ్ళలా వెళ్ళిన కొద్ది సేపటికి, తూర్పు తెల్లవారుతూండగా, మునసబు పెద్ద వైద్యుడితో సహా గుర్రబ్బండిలో దిగాడు. అప్పటికే మునసబుగారింటి ముందు నలుగురూ పోగయారు. మునసబు భార్యకు సుస్తిగా ఉందని వాళ్ళకు తెలుసు. ఇంటి బయట పాడే, కుండా కనిపించే సరికి, "ఇంకేముంది? అంతా అయిపోయినట్టుంది!" అని వాళ్ళలో వాళ్ళు అనుకోసాగారు.

ఈ జనాన్నీ, పాడెనూ, కుండనూ చూసి మునసబుకాస్తా కాళ్ళు చల్లబడ్డాయి.



"ఇంకేముందండీ! నా కొంప కూల్చేసిందండీ!" అని మునసబు శోకాలు పెట్ట సాగాడు. తాను అంతా మించిపోయి వచ్చాననుకుని వైద్యుడు, ఆ బండిలోనే పట్నానికి తిరిగి వెళ్ళే ఆలోచన చేశాడు. మునసబు గారింటి ముందు పెద్ద గుంపు పోగై, రకరకాల మాట్లాడసాగారు.

అప్పుడే నిద్రలేచిన మునసబు తల్లీ, భార్యా ఇంటి బయట మునసబు పెట్టే శోకాలు విని, పట్నంలో ఆయన కేదో పెద్ద కీడే జరిగిందనుకుని, తాము కూడా పెద్ద పెట్టున ఏడుస్తూ వచ్చి తలవాకిలి తలుపు తీశారు. తన భార్య ప్రాణాలతో కనపడగానే మునసబు దుఃఖం ఆశ్చర్యంగా మారింది. ఇంతలోనే ఊరు నాలుగు మూలల నుంచీ కబురందింది. మునసబుగారింటి ముందు పెట్టినట్టే ఎవరో గిట్టనివాళ్ళు ఇంకా రెండు మూడిళ్ళ ముందు పాడెలూ, కుండలూ ఉంచారట. "ఇది మేదరివాడి పనీ, కుమ్మరివాడి పనీ అయి ఉంటుంది. వాళ్ళని పిలుచుకురండి," అని మునసబు మనుషుల్ని పంపాడు. కాని వాళ్ళిద్దరూ తెల్లవారుఝామునే పట్నం వెళ్ళినట్టు తెలిసింది.

మర్నాడు అచ్చయ్యా, బుచ్చయ్యా తిరిగి వచ్చాక మునసబు వాళ్ళని పిలిపించి, "మీరేనా ఈ పాడు పని చేసింది? మీకేం పొయ్యే కాలం?" అని అడిగాడు.

"మేం అర్జంటుగా పట్నం వెళ్ళాలి సొచ్చింది. తమరు ఊళ్ళో లేరు. అందుచేత చెప్పిపోవటానికి లేదాయె. మాతో ఎవరికన్నా అవసరం వచ్చినా పని గడుస్తుంది గదా అని ఇలా చేశాం!" అన్నారు అచ్చయ్య, బుచ్చయ్యలు.

"అందుచేత నేమిటంటే, అమాయకులు మంచి ఉద్దేశంతో కూడా ఒక్కొక్కసారి తెలివితక్కువ పనులు చెయ్యటం జరుగుతుంది!" అంటూ తాతయ్య స్నానానికి లేచాడు. [రచన: చల్లా లక్ష్మి]





# అమాయకులు పట్టిన దొంగ

ఒక గ్రామంలో శ్యామారాధ్యులూ, సోమాంబా అనే దంపతు లుండేవారు. వారు చాలా మంచివారు; బొత్తిగా అమాయకులు, తెల్లని వన్నీ పాలూ, నల్లని వన్నీ నీళ్ళూ అను కునేవాళ్ళు. వారికి తగుమాత్రం డబ్బున్నది. ఎప్పుడూ దానధర్మాలు చేస్తూ, అన్నింటికీ దైవం మీదే ఆధారపడి జీవయాత్ర చేస్తూండే వారు. ఎంతో సాధువులు కావటం చేత ఊళ్ళో అందరూ ఆ దంపతులంటే ఎంతో ఆదరంగా వుండేవారు.

ఆ వూరికి ఒక దొంగ వచ్చాడు. వాడు పగటిపూట ఒక్కొక్క ధనవంతుడి ఇంటికీ వెళతాడు. వెళ్ళేటప్పుడు ఆ ఇంటి వారికి అనుకూలంగా వుండే వేషం వేసుకుంటాడు. అందుచేత ఇల్లుగలవారు వాణ్ణి లోపలికి రానిస్తారు. అప్పుడు వాడు ఇంటి రహస్యాలన్నీ కనిపెడతాడు. ఆ తరవాత వీలు చూచుకుని వాడు ఆ ఇంట దొంగతనం చేస్తాడు. దొంగ ఈ విధంగా గ్రామంలో రెండు మూడిళ్ళలో దొంగతనం చేశాక వాడి కన్ను శ్యామారాధ్యుల ఇంటిపై పడింది. వారింట దంపతు లిద్దరే వుంటారనీ, వారు బొత్తిగా అమాయకులనీ తెలుసుకున్నాడు. వాడు తెల్లని గడ్డమూ, మీసాలూ పెట్టుకుని, ఒక విచిత్రమైన కిరీటం లాంటిది నెత్తిన పెట్టుకుని, ఒక గోతంలో తాను తస్కరించిన పైకం కొంత పెట్టుకుని, రాత్రి పొద్దుపోయి వచ్చి శ్యామారాధ్యుల ఇంటి తలుపు తట్టాడు. "ఎవరు వారు?" అని శ్యామారాధ్యులు అడిగాడు.

"నేనే! తలుపు తెరవండి!" అన్నాడు దొంగ. శ్యామారాధ్యులు తలుపు తెరిచి, దొంగ అవతారం చూసి నిర్ఘాంతపోయి నిలబడిపోయి, "తమ రెవరు?" అని అడిగాడు.

దొంగ లోపలికి వచ్చి తలుపు మూస్తూ, "నేను ద్వార దేవతను; గృహదేవతయొక్క

వి. సుందరరావు



బంటును. ప్రతి ఇంటా పదివేల రూపాయల సొత్తున్నదా లేదా చూసి రమ్మని గృహ దేవత నన్ను పంపారు. ఎవరింటనైనా పది వేలకు పైబడి వుంటే సరేసరి. పదివేలకు తక్కువ వుంటే దాన్ని తీసుకుపోయి తెల్ల వారేలోపుగా పదివేలు చేసి అందించవలిసిం దిగా గృహదేవుడుగారి ఆజ్ఞ," అన్నాడు.

"తమరు అందరి ఇళ్లకూ ఇలా వేంచే స్తారా, స్వామీ?" అని అడుగుతూ శ్యామా శాస్త్రులు సగౌరవంగా దొంగను లోపలికి తీసుకువెళ్ళాడు.

"లేదు, లేదు. మీ వంటి మంచి భగవ ద్భక్తులూ, ధర్మాత్ములూ అయిన వారి ఇళ్ళకు మాత్రమే గృహదేవత నన్ను పంపు తారు. ఇప్పుడే ఒక మహానుభావుల ఇంటి నుంచి వస్తున్నాను. ఈ సంచీలో వుండే ధనం వారింటి నుంచి తెచ్చినదే. ఏదీ? మీ ఇంట్లో వుండే ధనమంతా తెచ్చి నాకు చూపండి. నేను దానికి ఖరీదు కట్టు కోవాలి," అన్నాడు దొంగ.

అమాయకులైన ఆ భార్యా భర్తలు తమ ఇంట వుండే డబ్బూ, బంగారమూ అంతా తెచ్చి దొంగవాడి ముందు పెట్టారు.

"అయ్యో, పాపం, మీ ఇంట గట్టిగా అయిదువేల సొత్తయినా లేదే! దీన్ని గృహ దేవతగారికి చూపి పదివేలు చేసి తెల్లవారే లోపుగా తెస్తాను," అన్నాడు దొంగ, వెళ్ళి పోవటానికి సిద్ధమవుతూ.

"అప్పుడే వెళ్ళిపోకండి. రాకరాక వచ్చి మా ఇల్లు పావనం చేశారు. మా ఆతిథ్యం పొందకుండా వెళ్ళటం మర్యాద కాదు. క్షణంలో భోజనం తయారవుతుంది," అన్నారా దంపతులు.

ఆతిథ్యం నిరాకరిస్తే వారికి అనుమానం కలుగుతుందనీ, వీరు తనమాటలు పూర్తిగా నమ్మారు గనక తెల్లవారే లోపుగా ఎప్పుడు వెళ్ళినా తనకు నష్టంలేదనీ అనుకుని దొంగ ఆతిథ్యం స్వీకరించటానికి సమ్మతించాడు.

వెంటనే సోమాంబ పొయ్యి రాజేసి రొట్టెలూ, పాలూ, చట్నీలూ సిద్ధం చేసి, వాటితో బాటు ఇన్ని పళ్ళుకూడా తెచ్చి దొంగ ముందు పెట్టింది. పంటకాలు చాలా బాగు న్నాయి, దొంగ అకలిమీద వున్నాడు. అందు చేత వాడు ఎక్కి తొక్కినట్టుగా తినేసి, చెంబెడు నీళ్ళు తాగేశాడు.

"పదార్థాలు చాలా రుచిగా వుండటం చేత జాస్తిగా తినేశాను. భుక్తాయాసమై పోయింది," అన్నాడు వాడు.

"కాస్సేపు విశ్రాంతి తీసుకుని పోదురు గాని. ఇంతలో తొందర ఏమివచ్చింది?" అన్నారు దంపతులు. వాళ్ళు మెత్తగా అమర్చిన పక్కమీద మేనువాల్చగానే దొంగకు నిద్రమత్తు ముంచుకు వచ్చింది.

"అయ్యో, వారు ఈ సంచీ ఇక్కడే పెట్టి నిద్రపోతున్నారు, మనం కూడా పడుకున్నాక ఏ దొంగైనా వస్తాడో ఏమో! ఈ సంచీ బీరువాలో దాయండి. వారు వెళ్ళేటప్పుడు ఇవ్వవచ్చు," అన్నది సోమాంబ భర్తతో. ఆరాధ్యులు దొంగవాడి గోతాన్ని అట్లాగే తీసుకుపోయి బీరువాలో పెట్టి తాళం పెట్టాడు. తరవాత ఆ భార్యా భర్తలు పడుకుని నిద్రపోయారు.

తెల్లవారుజామున దొంగకు మెలకువ వచ్చింది. భార్యాభర్త లిద్దరూ గాఢ నిద్రలో



వున్నారు. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. వెళ్ళి పోవటానికి ఇదే తరుణమనుకుని వాడు తన గోతపు సంచీ కోసం తడువుకుంటూంటే వాడి చేతికి చిలగడదుంపల సంచీ దొరికింది. అదే తన సంచీ అనుకుని దాన్ని ఎత్తి నెత్తిన పెట్టుకుని, తలుపు గడియ తీసి బయటపడి పొరుగూరుదారి పట్టుకున్నాడు.

ఊరు దాటి చెరువు గట్టుకు చేరేసరికి తెల్ల వార వచ్చింది. అప్పుడు దొంగకు నిద్ర మత్తుకూడా పూర్తిగా వదలటాన తన నెత్తి మీద సంచీలో వున్నది డబ్బూ, నగలూ కావల్లే వున్నట్టు వాడికి అనుమానం తగి లింది. వాడు సంచిని గట్టు మీద దించి విప్పదీసి చూస్తే—ఏముందీ?—అన్నీ చిలగడ దుంపలు!

తానే చీకట్లో పొరపాటున ఒక సంచీకి బదులు మరొకటి తెచ్చి వుంటానని దొంగ అనుకున్నాడు. వాడు ఆ సంచీని అక్కడే వుంచి, చెరువులోకి దిగి, ముఖం కడుక్కొని గట్టు మీదికి వచ్చేసరికి, ఎక్కడినుంచో రెండు మూడు గేదెలు వచ్చి చిలగడ దుంప లను తృప్తిగా తింటున్నాయి.

"తినండి! తినండి! ఈ రాత్రి నేను మళ్ళీ వెళ్ళి ఆ వెర్రిబాగుల వాళ్ళ దగ్గిర చిక్కిపోయిన నా అసలు సంచీ తెచ్చు కుంటాలే!" అన్నాడు దొంగ.



దొంగ వెళ్ళిపోయిన కాస్సేపటికి సోమాంబ లేచి, ద్వారదేవుడు వెళ్ళిపోయిన సంగతి తెలుసుకుని, భర్తను నిద్రలేపి, "వారు చెప్పకుండా వెళ్ళిపోయినట్టున్నారే! సంచీకూడా తీసుకుపోలేదు," అన్నది.

ఈ మాటకు శ్యామారాధ్యులు, "వెర్రి దానా, వరాలిచ్చేవారు చెప్పకుండానే వెళ్ళి పోతారు. సంచీ వారు తీసుకుపోలేదని ఏమిటి నమ్మకం?" అన్నాడు.

బీరువా తెరిచి చూస్తే సంచీ వున్నది. కాని అందులోవున్న నగదూ, బంగారమూ అంతా ఎంచితే పదివేల రూపాయల విలువ వుండనే వున్నది.

"చూశావా, వారు సంచీ తీసుకు పోనూ పోయారు, పదివేలు చేసి మనకు తిరిగి ఇవ్వనూ ఇచ్చారు!" అన్నాడు అమాయకుడైన ఆరాధ్యులు.

చిలగడదుంపల సంచీ పోయిన సంగతి తెలియగానే ఆ దంపతులు గృహదేవతకు అవి యిష్టంకాబోలు ననుకుని, రోజూ ఆ దేవుడికి చిలగడదుంప ఒకటి నైవేద్యం పెట్టటానికి నిశ్చయించుకున్నారు.

సోమాంబ కొత్త నగలు ధరించి ఎరిగిన వారందరి ఇళ్ళకూ వెళ్ళి గడచిన రాత్రి జరిగిన అద్భుతం గురించి అందరికీ సవిస్తరంగా చెప్పింది.



ఆమె ధరించిన నగలలో కొన్ని నారాయణభండారి అనే ధనికుడి ఇంట దొంగలు దోచుకుపోయినవి. తమ ఇంట పోయిన నగలు ఆరాధ్యుల భార్య వంటిన కనిపించి నట్టు ఆనోటా ఆనోటా విని, ఆ అమాయకురాలికి దొంగతనం అంటగట్టటం అసంభవం గనక, ఏమి జరిగినదీ తెలుసుకోవటానికి నారాయణభండారి ఆరాధ్యుల ఇంటికి వచ్చాడు. భార్యా భర్త లిద్దరూ జరిగినదంతా—చిలగడదుంపల సంచీ పోవటంతో సహా—చెప్పేశారు.

అప్పుడు భండారి రాజాధికారి దగ్గిరికి పోయి ఎవడో దొంగవాడు దొంగతనానికిగాను మారు వేషంతో శ్యామారాధ్యుల ఇంటికి వచ్చి, ప్రమాదవశాన తాను తెచ్చిన సంచీకి బదులు చిలగడదుంపల గోతం ఎత్తుకు పోయినట్టు చెప్పాడు.

"అయితే వాడు మళ్ళీ ఈ రాత్రి తన నగల కోసం వచ్చితీరుతాడు. అప్పుడు మేము వాణ్ణి మాటువేసి పట్టుకుంటాం. మీరు మాత్రం మీ పోయిన నగలు శ్యామారాధ్యుల ఇంటికి చేరినట్టు ఎక్కడా చెప్పకండి," అన్నాడు రాజాధికారి భండారితో.

ఈ ఎత్తు పారింది. సరిగా అర్థరాత్రివేళ దొంగ నిన్నటి వేషంలో వచ్చి శ్యామారాధ్యుల ఇంటి తలుపు తట్టాడు. శ్యామారాధ్యులు తలుపు తీసి, "తమరేనా, స్వామీ! దయ చెయ్యండి, దయచెయ్యండి!" అన్నాడు. దొంగవాడు తలుపు గడియ పెట్టటానికి వెనక్కు తిరిగేలోపుగా సాయుధభటులు వచ్చి దొంగను పట్టుకుని, వాడి గడ్డమూ, మీసాలూ లాగేశారు.

వాడు ఊళ్ళో దొంగిలించిన నగలూ, డబ్బూ ఎవరివి వారికి దక్కాయి. దొంగను శిక్షపడింది.

గొప్ప జిత్తులమారి అయిన దొంగను పట్టిచ్చినందుకు శ్యామారాధ్యులకు రాజుగారు చిన్న బహుమానంకూడా ఇచ్చాడు.






# అన్నా - చెల్లెలు

## 3

బొగ్దాదు వదిలిపెట్టిన ఘానిం, గుండెలు పగిలేలాగా ఏడుస్తూ ఒక రోజల్లా కాలినడక నడిచి ఒక గ్రామం చేరుకున్నాడు. ఒక వంక దుఃఖమూ, మరొక వంక బడలికా, ఆకలి దప్పులూ అతన్ని బాగా కుంగదీశాయి. ఎవరినన్నా పలకరించి ఆతిథ్యం అడిగే శక్తికూడా లేక అతను మసీదు ఆవరణలో ఒక చాప మీద శరీరం వాల్చి మైకంలో పడిపోయాడు.

మర్నాడు ఉదయం మసీదుకు ప్రార్థనల కోసం వచ్చినవారు అతన్ని చూసి శవమే అనుకున్నారు. కాని పరిశీలించిన మీదట అతను శోషిల్లినట్టు తెలిసింది. ఎవరో ధర్మాత్ములు అతని పక్కన రెండు రొట్టెలూ, ఒక తేనె పిడతా పెట్టారు.

ఘానిం వ్యాధిగ్రస్తుడై నెల రోజులపాటు ఆ చాప మీదే ఉన్నాడు. అతని శరీరం చిక్కి శల్యమయింది. తన మీద ఈగలు ముసురుతున్నది కూడా అతను ఎరగడు. ఇక అతను బతకడని నిర్ధారణ చేసుకుని గ్రామస్తులు అతన్ని బాగ్దాదులోని ఆసుపత్రికి పంప నిశ్చయించారు.

ఒక ఒంటెలవాడు డబ్బు తీసుకుని అతన్ని ఆస్పత్రికి చేర్చటానికి ఒప్పుకున్నాడు. అతన్ని చాపతో సహా చుట్టి ఒంటె మీద ఎక్కిస్తూ ఉండగా ఘానిం తల్లీ, చెల్లెలూ అటుగా వస్తూ, "ఎవరో, పాపం, దిక్కులేనివాడు. మన ఘానింలాగే ఉన్నాడు కాదూ?" అనుకున్నారు. వాళ్ళు కాలి నడకన డమాస్కను నుంచి బాగ్దాదుకు పోతూ పొట్టకొట్టుకుని దిక్కులేని స్త్రీల లాగా ఉన్నారు.

ఒంటెలవాడు ఘానింను ఒంటె పైన వేసి బాగ్దాదుకు చేర్చి, ఆసుపత్రి ఇంకా

సి. మాధవరావు



తెరప నందున ఘానింను ఆసుపత్రి మెట్ల మీద పడుకోబెట్టి, ఒంటెను తీసుకుని తిరుగు ప్రయాణమై వెళ్ళిపోయాడు.

అదృష్టవశాత్తూ అక్కడికి బాగ్దాదు వర్తక ప్రముఖుడొకడు వచ్చి, ఘానింను చూసి, "ఎవరో, పాపం, కుర్రవాడు! ఆస్పత్రిలో ప్రవేశించాడంటే తిరిగి ప్రాణాలతో బయటపడడు. ఇతన్ని ఇంటికి తీసుకుపోయి చికిత్స చేయించానంటే అల్లా కృప వల్ల ఆ లోకంలో సుఖపడతాను," అనుకున్నాడు. ఆయన తన బానిసల చేత ఘానింను తన ఇంటికి పట్టించుకు పోయి, తన భార్యతో, "అల్లా మనకీ అతిథిని పంపాడు. ఇతనికి ఏ లోటూ రానీయకు," అని చెప్పాడు.

వర్తకుడి భార్య పెద్ద అండాలో నీళ్ళు కాగ బెట్టించి, ఘానింకు స్నానం చేయించి, తన భర్త దుస్తులు తొడిగించి, అతని చేత ఒక గ్లాసు షర్బతు తాగించి, అతని ముఖం పన్నీరుతో తుడిపించింది. ఈ ఉపచారాలతో ఘానింకు శ్వాస కాస్త బాగా ఆడింది. బలంకూడా కొంచెం కొంచెంగా తిరిగి రాసాగింది. అతనికి తన గతమంతా జ్ఞాపకం వచ్చింది. ఎంతో కాలమయాక మళ్ళీ కూతల్ కులూబ్ గురించి ఆలోచించ సాగాడు...

కూతల్‌కులూబ్‌ను చీకటికొట్టులో వేయమని ఆజ్ఞాపించిన ఖలీఫా ఆమెను పూర్తిగా మరిచాడు. ఇరవైనాలుగు రోజులు గడిచాక ఖలీఫా ఆ చీకటికొట్టు పక్కగా వెళుతూ లోపల ఎవరో అనుకుంటున్న మాటలు విన్నాడు.

కూతల్‌కులూబ్ ఘానింను ఉద్దేశించి ఈ విధంగా అనుకుంటున్నది: "ఖలీఫాతో పోలిస్తే నువ్వెంత ఉదారుడివి! ఆయన మనిషినని నీవు నా మానం కాపాడావు; ఆయన నీ తాలూకు స్త్రీలకు తీరని అపచారమూ, అవమానమూ చేశాడు! కాని ఆయన అల్లా సమక్షంలో నిలబడి ఈ పాపా

నికి సంజాయిషీ చెప్పుకోవలిసిన రోజు వస్తుంది. నీకు అకారణంగా ద్రోహం చేసిన ఖలీఫాకు దేవతలు తగిన శిక్ష విధించక వదిలిపెడతారా?"

ఈ మాట లంటున్నది కూతల్‌కులూబ్ అని తెలుసుకుని ఖలీఫా, తాను ఘానింకు ద్రోహం చేసిన సంగతి కూడా గ్రహించాడు. ఆయన ఆమెను తన సమక్షానికి రప్పించి, "నేను ఎవరికి ద్రోహం చేశాను? నా స్త్రీ మానాన్ని కాపాడిందెవరు?" అని అడిగాడు.

"వర్తకుడు ఘానిం! అతను ఎంత మృదుస్వభావంకలవాడు! ఎంత పెద్ద మనిషి! అక్రమమైన పని చెయ్యటం అతనికి సాధ్యంకాదే!" అన్నదీ కూతల్ కులూబ్.

"పొరపాటు జరిగిపోయింది. ఇందుకు పరిహారంగా నీ కేం కావాలో కోరుకో! తప్పక ఇస్తాను," అన్నాడు ఖలీఫా.

"ప్రభూ, నాకు ఘానింను ఇప్పించండి. అతను తిరిగివస్తే అతన్ని పెళ్ళాడటానికి అనుమతి ఇవ్వండి," అన్న దామె.

"మాట ఇచ్చి కాదంటానా? అలాగే పెళ్ళాడు," అన్నాడు ఖలీఫా.

"ఇంతకూ, ఘానిం ఎక్కడ ఉన్నదీ ఎవరికీ తెలిసినట్టు కనబడదు. అతన్ని



నేనే స్వయంగా వెతుక్కుంటాను," అన్నదామె.

"నీకు ఎలా చేయాలని ఉంటే అలా చెయ్యి. నా అభ్యంతరం ఏమీ లేదు," అన్నాడు ఖలీఫా.

కూతల్ కులూబ్ పరమానందభరితురాలై, వెయ్యి బంగారు దీనారాలు వెంట తీసుకుని ఆ రోజే బాగ్దాదునగర మంతా కలయ తిరిగింది. ఎంత వాకబు చేసినా ఆమెకు ఘానిం వార్త తెలియరాలేదు. మర్నాడామె నగరంలోని వర్తక కేంద్రాలన్నీ తిరిగి, ప్రతి కేంద్రంలోనూ ప్రముఖ వర్తకుడికి తన కథ చెప్పుకుని, బీదలకు దానం



చేయమని డబ్బిచ్చింది. మూడోనాడు ఆమె నగల వర్తకుల పేటకు వెళ్ళి అక్కడి వర్తక ప్రముఖుడికి కూడా తన కథ చెప్పి, దానధర్మాలకు డబ్బిచ్చింది.

అప్పుడా వర్తకు డామెతో, "అమ్మా, దైవికంగా నే నొక యువకుడికి మా ఇంట ఆశ్రయమిచ్చాను. అతను చాలా జబ్బుగా ఉన్నాడు. నా కతని పేరు తెలియదు గాని, మనిషి శవంలాగా ఉన్నప్పటికీ అంద చందాలు గలవాడనీ, గొప్ప వంశంలో పుట్టిన వాడనీ తెలుస్తూనే ఉంది. అతను ధనాన్నో, ప్రేమనో కోల్పోయాడని నేను అనుకుం టున్నాను," అన్నాడు.

ఈ మాటలు వింటుంటే ఆమె హృదయం వేగంగా కొట్టుకోసాగింది. ఆమె వర్తకుడితో, "తాతగారూ, ఎటూగాని వేళ మిమ్మల్ని దుకాణం విడిచి రమ్మనటం భావ్యంగా ఉండదు. మీ. ఇల్లు చూపగల మనిషి నెవరినైనా నా వెంట పంపుతారా?" అని అడిగింది. వర్తకుడు వెంటనే ఒక చిన్న పిల్లవాణ్ణి పిలిచి, "ఒరే, ఈమెను మా ఇంటికి తీసుకు పో," అన్నాడు.

కుర్రవాడి సహాయంతో కూతల్‌కులూబ్ వర్తకుడి ఇంటికి వచ్చి మంచాన పడి ఉన్న ఘానింను చూసింది, కాని గుర్తించ లేక పోయింది. ఆమె అతన్ని చూసి జాలి పడుతూ వర్తకుడి భార్యతో, "తన దేశంలో రాజే అయినా కాని దేశంలో వచ్చి పడిన వాడు ఎంత దురదృష్టహీనుడు! ఇతనికి మందులూ అవీ జాగ్రత్తగా ఇప్పించండి," అంటూ కొంత డబ్బు ఇచ్చి రాజభవనానికి తిరిగి వెళ్ళిపోయింది.

ఆమె ప్రతి రోజూ నగరం మూల మూల లకు వెళ్ళి ఘానిం కోసరం ఇంకా వెతు కుతూ ఉంది. ఇలా ఉండగా నగల వర్తక ప్రముఖుడు ఒకనాడు ఆమెకు ఎదురై, "అమ్మాయీ, బాగ్దాదుకు రోజూ వచ్చే అనాథులను గురించి వాకబు చేస్తూ ఉండ

మని నాతో అన్నావు గదా. ఇవాళ ఇద్దరు అనాథ స్త్రీలు నాకు తటస్థపడ్డారు. వారు చాలా దీనావస్థలో ఉన్నారు. కాని గొప్ప ఇంటి వాళ్ళనిపిస్తుంది," అన్నాడు.

వారిని తన వద్దకు తీసుకు రమ్మని కూతల్‌కులాబ్ ఆయనను కోరింది. ఆయన అలాగే చేశాడు. వారిని చూస్తూనే ఆమె కంట తడిపెట్టుకుని, "అయ్యో, వీరు కష్టాల కోసం పుట్టినవారు కారు. ఒకప్పుడు ఎంతో గౌరవంగా బతికినవారు. మొహాలు చూస్తేనే తెలుస్తున్నది," అన్నది.

ఈ మాటలు విని ఆ ఇద్దరు స్త్రీలుకూడా ఏడిచారు. వారు ఘానిం తల్లీ, చెల్లెలూనూ. ఘానిం తల్లి కూతల్‌కులాబ్‌తో, "అమ్మా, మేము నా కొడుకు ఘానిం కోసం వెతుకుతున్నాం. మా అన్వేషణ ఫలించాలని అల్లాను ప్రార్థించమ్మా!" అన్నది.

ఈ మాట వినగానే కూతల్‌కులాబ్ స్పృహ తప్పి పడిపోయింది. వారిద్దరూ తన ప్రియుడి తల్లీ, చెల్లెలూ అని ఆమె గ్రహించింది. స్పృహ తెలుస్తూనే ఆమె వారిద్దరినీ కౌగలించుకుని, "అల్లాను నమ్మండి. నాలోకూడా విశ్వాసం ఉంచండి. ఇక మీ కష్టాలు తొలగిపోతాయి," అన్నది. ఆమె వర్తకుడికి వెయ్యి దీనారాలిస్తూ,



"తాతగారూ, వీరిద్దరినీ మీ ఇంటికి తీసుకుపోయి, వారికి చక్కగా స్నానాలు చేయించమనీ, మంచి బట్టలు కట్టించమనీ మీ భార్యతో చెప్పండి. వారిని అన్ని విధాలా ఆదరణతో చూడండి," అన్నది.

మర్నాడు ఉదయం ఆమె వారిని పరామర్శించటానికి వర్తకుడి ఇంటికి వెళ్ళేసరికి వారిద్దరూ పూర్తిగా మారిపోయి రాణివాసపు స్త్రీలలాగా ఆమె ఎదట ప్రత్యక్షమయారు. తరవాత ముగ్గురూ కలిసి రోగి వద్దకు వెళ్ళారు. అతనింకా అపస్మార స్థితిలోనే ఉన్నాడు. అతన్ని అతని తల్లిగాని, చెల్లెలు గాని గుర్తించనే లేదు.

వారు ముగ్గురూ అక్కడే కూచుని మాట్లాడటంలో కూతల్‌కులూబ్ అనే మాట వచ్చింది. వెంటనే ఘానిం కళ్ళు తెరిచి, మోచేతి మీద కొద్దిగా లేచి, "ఎక్కడున్నావు, కూతల్‌కులూబ్?" అన్నాడు.

"ఇక్కడే ఉన్నాను. నువ్వు నిజంగా ఘానిం వేనా?" అన్నది కూతల్‌కులూబ్ ఆత్రంగా లేస్తూ.

"అవును, నేను ఘానింనే!" అన్నాడతను. ఆ తరవాత ఏమి జరగాలో అదంతా జరిగింది. అందరూ ఆనందాశ్రువులు రాల్చారు. ఒకరి నొకరు కౌగలించుకున్నారు.

కూతల్‌కులూబ్ తన ప్రియుడితో, ఖలీఫా జరిగిన దానికి పశ్చాత్తాప పడ్డాడనీ, తామిద్దరూ పెళ్ళాడటానికి కూడా ఒప్పుకున్నాడనీ చెప్పి, రాచనగరుకు వెళ్ళిపోయింది. ఆమె అక్కడి నుంచి ఆ స్త్రీలిద్దరికీ రాజోచితమైన దుస్తులు పంపింది. నాలుగు రోజులపాటు పుష్టికరమైన ఆహారం వారికి ఏర్పాటు చేసింది. తరవాత ఖలీఫాతో అంతా చెప్పేసింది.

ఖలీఫా ఘానింను తన దర్బారుకు పిలిపించాడు. ఘానిం అందమూ, అతని వినయ ప్రవర్తనా ఖలీఫాను ముగ్ధుణ్ణి చేశాయి. అందరూ వింటూండగా ఘానిం తన కథ ఉన్నదున్నట్టు చెప్పాడు. అతను నిర్దోషి అని ఖలీఫాకు మరింత బాగా నమ్మకం కుదిరింది. ఆయన ఘానింపై దౌర్జన్యం చేసినందుకు క్షమాపణ చెప్పుకుని అతనికి మంచి ఉద్యోగమూ, నౌకర్లూ మొదలైనవి ఏర్పాటు చేశాడు.

ఘానిం చెల్లెలు ఫిత్నా అపూర్వ సౌందర్యవతి. ఆమె చక్కదనం చూసి ఖలీఫా ఆమెను పెళ్ళాడగోరాడు. ఇందుకు ఘానిం సంతోషంగా సమ్మతించాడు. ఘానింకూ, ఖలీఫాకూ ఒకే సమయంలో వివాహాలు జరిగాయి. తరవాత అందరూ సుఖంగా ఉన్నారు. —(అయిపోయింది)





# అరణ్యకాండ

రాముడు సీతా లక్ష్మణులతో సహా మహా భయంకరమైన దండ కారణ్యం ప్రవేశించాడు. అరణ్యం అంచునే ఋష్యాశ్రమాలున్నాయి. ఆశ్రమాలుండే ప్రాంతం అందంగానూ, వాసయోగ్యంగానూ ఉన్నది.

అక్కడి ఋషులు సీతా రామలక్ష్మణులకు చక్కని ఆతిథ్య మిచ్చి, "రామా, రాజు దుష్ట శిక్షణ చేస్తాడు గనక ప్రజలకు తండ్రి వంటి వాడు. మేము నీ రాజ్యంలో ఉన్నాం. నీవు పట్టణములో ఉన్నా, అరణ్యంలో ఉన్నా మాకు రాజువే. అందుచేత నీవే మమ్మల్ని ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉండాలి," అన్నారు.

రాముడు ఆ ఆశ్రమాలలో రాత్రి గడిపి ఉదయం కాగానే సీతా లక్ష్మణులతో సహా నిర్జనమైన భీకరారణ్యం ప్రవేశించాడు. ఈ భయంకరారణ్యంలో అందమన్నది లేదు. ఎటు చూసినా భయంకరమైన దృశ్యాలే. చెట్లు చీకాకుగా ఉన్నాయి. నీటి మడుగులు అసహ్యం పుట్టిస్తున్నాయి. సమస్త భీకర జంతువులూ ఆ అరణ్యంలో తిరుగాడుతున్నాయి.

దారిలేని ఆ అరణ్యంలో పడి వారు పోతూండగా వారి కొక రాక్షసుడు ఎదురయాడు. వాడు చాలా ఎత్తుగా ఉన్నాడు. పెద్ద నోరు; పెద్ద పొట్ట; చూస్తేనే రోత పుట్టే ఆకారం! వాడి చేతిలో ఒక పెద్ద శూలం ఉన్నది. దానికి సింహాలూ, పులులూ, తోడేళ్ళూ, జింకలూ, ఒక ఏనుగు తలా గుచ్చి ఉన్నాయి. ఆ రాక్షసుడు సీతా రామ



లక్ష్మణులను చూస్తూనే యముడిలాగా మీదికి వచ్చి, సీతను అవలీలగా ఎత్తి చంకన పెట్టుకుని, "మీరు ఆయుపు తీరి ఈ అరణ్యంలోకి వచ్చినట్టున్నారు. మీరు చూస్తే ఋషి వేషాలు ధరించారు, మరి మీ వెంట ఈ ఆడది ఎందుకున్నది? నేను దీన్ని పెళ్ళాడేస్తాను. ఋషులను తినటం నాకు అలవాటే, అందు చేత మిమ్మల్ని చంపి మీ రక్తం తాగేస్తాను," అన్నాడు.

రాక్షసుడి చంకలో చిక్కి గిలగిలా కొట్టుకుంటున్న సీతను చూడగానే రాముడికి దుఃఖంతో నోరార్చుకు పోయింది. అతను లక్ష్మణుడితో, "ఏ ఉద్దేశంతో కైకేయి నన్ను అడవికి పంపిందో ఆ ఉద్దేశం కొంచెం కొంచెమే నెరవేరుతున్నది. లక్ష్మణా, తండ్రి చనిపోయినా, రాజ్యం పోయినా కలగని బాధ వీడు సీతను తాకటం చేత కలుగుతున్నది!" అన్నాడు కన్నీరు కార్చుతూ.

రాముడి దుఃఖం చూసి లక్ష్మణుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. "నేను పక్కన ఉండగానే అలా విచారిస్తావేమిటి? ఒక్క బాణంతో నేను వీడి ప్రాణాలు తీస్తాను," అని అతను రాముడితో అని రాక్షసుడితో వెటకారంగా, "నాయనా, ఈ అరణ్యంలో సుఖంగా తిరిగే నువ్వెవడవు?" అన్నాడు.

"అడిగేవాణ్ణి నేను, చెప్పేది మీరు! ఇటుకేసి ఎక్కడికి పోతున్నారు?" అన్నాడు రాక్షసుడు.

"మేము క్షత్రియులం. సదాచారం గల వాళ్ళం. అరణ్యవాసం చేస్తున్నాం. నీ సంగతి చెప్పు," అన్నాడు రాముడు.

"నా సంగతి చెబుతా విను. నా తండ్రి జయుడు, తల్లి శతహ్రద. నా పేరు విరాధుడు. బ్రహ్మను గురించి పెద్ద తపస్సు చేసి నేను ఏ ఆయుధంతోకూడా చావకుండా వరం పొందాను. అందుచేత మీరీ ఆడదాని మీద ఆశ వదులుకుని, పారిపోయి





ప్రాణాలు రక్షించుకోండి. మీ ప్రాణాలు తీస్తే నా కేం లాభం?" అన్నాడు రాక్షసుడు.

రాముడి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. "నీచుడా, పర స్త్రీహరణం చేస్తావా? నీకు కాలం మూడింది," అంటూ అతను విల్లు ఎక్కుపెట్టి ఏడు కరుకైన బాణాలు రాక్షసుడి శరీరంలో దిగిపోయేటట్టు కొట్టాడు.

విరాధుడు ఎగతాళిగా నవ్వుతూ సీతను కింద దించి, ఒక్కసారి ఒళ్ళు విరుచుకునే సరికి ఏడు బాణాలూ వాడి శరీరం నుంచి బయటికి వచ్చి, కింద పడిపోయాయి. వాడు కోపంతో శూలం ఎత్తి రామలక్ష్మణుల పైకి వచ్చాడు.

రాముడు రెండు బాణాలతో వాడి శూలాన్ని ముక్కలు చేశాడు.

కాని విరాధుడు లక్ష్య పెట్టక వారిని పట్టుకోవటానికి యత్నించాడు. రామ లక్ష్మణులు కత్తులు దూసి వాణ్ణి ఎన్నో పోట్లు పొడిచారు. ఆ పోట్లనుకూడా లక్ష్య పెట్టక వాడు ఆ ఇద్దరినీ అవలీలగా చెరొక భుజం మీదికి ఎత్తుకుని అరణ్యానికి అడ్డం పడి నడవసాగాడు.

"వీడిలా మనని ఎక్కడికి తీసుకుపోతాడో చూద్దాం," అని రాముడు లక్ష్మణుడితో అన్నాడు.

కాని సీత మాత్రం వాడి చేతులు పట్టుకుని, గట్టిగా ఏడుస్తూ, "అయ్యో, ఈ రాక్షసుడు రామ లక్ష్మణులను ఎత్తుకుపోతున్నాడు. నన్ను తోడేళ్ళో పెద్దపులులో మింగేస్తాయి!...ఓ రాక్షసుడా, నీకు దణ్ణం పెడతాను. వారిని వదిలేసి నన్ను తినుకుపో!" అన్నది.

సీత చేసిన ఆర్తనాదం వినగానే రామ లక్ష్మణులు కూడ బలుక్కుని, తమ చేతులలో ఉన్న కత్తులతో విరాధుడి భుజాలు రెండూ నరికేశారు. వాడు కాస్తా పర్వతం కూలినట్టు కూలాడు. అలా కింద పడిన ఆ రాక్షసుణ్ణి రామ లక్ష్మణులు పిడికిళ్ళ



తోనూ, మోకాళ్ళతోనూ కుమ్మి మున్నంలోకి ఎముక లేకుండా చితక బొడిచారు. అప్పటికీ వాడి ప్రాణం పోలేదు.

విరాధుడు కదలకుండా వాడి కంఠంపైన కాలువేసి బలంగా తొక్కి పట్టి, రాముడు, "లక్ష్మణా, వీణ్ణి ఇలాగే పూడ్చేద్దాం. ఒక పెద్ద గొయ్యి తవ్వు," అన్నాడు. లక్ష్మణుడు వాడి పక్కనే గొయ్యి తవ్వాడు. రామ లక్ష్మణులు వాణ్ణి ఆ గోతిలోకి బలాత్కారంగా తోసేశారు. గోతిలో పడిపోతూ వాడు పెట్టిన పెడబొబ్బకు అరణ్యమంతా దద్దరిల్లింది. తరవాత రామ లక్ష్మణులు గుంటను రాళ్ళతో పూడ్చేశారు.



రాముడు సీతను కౌగలించుకుని, ధైర్యం చెప్పి, లక్ష్మణుడితో, "మనం ఇలాటి అరణ్యానికి అలవాటుపడిన వాళ్ళం కాదు. అందుచేత ఇక్కడ ఉండటం మంచిది కాదు. త్వరగా శరభంగ మహాముని ఆశ్రమానికి పోదాం," అన్నాడు.

వారు శరభంగ మహాముని ఆశ్రమాన్ని చేరవస్తూ ఉండగా రాముడి కొక వింత దృశ్యం కనిపించింది. భూమికి ఎత్తుగా ఒక కాంతివంతమైన రథం కనిపించింది. దానికి ఆకు పచ్చని గుర్రాలు కట్టి ఉన్నాయి. సూర్యుడులాగా వెలిగి పోతున్న ఒక మహాపురుషుడు, కాంతివంతమైన ఆభరణాలూ, స్వచ్ఛమైన బట్టలూ ధరించి, నేలను అంటకుండా ఆశ్రమంకేసి పోవటం కనిపించింది. ఆయన వెంట ఆయనలాటి వాళ్ళే అనేక మంది పరివారంగా ఉన్నారు. అందరూ పాతికేళ్ళ వయస్సుగల వాళ్ళే.

రాముడు లక్ష్మణుడికి ఈ దృశ్యం చూపించి, "లక్ష్మణా, అది దేవేంద్రుడు లాగుంది. నేను వెళ్ళి తెలుసుకువస్తాను. నీవూ, సీతా ఇక్కడే ఉండండి," అంటూ శరభంగాశ్రమం కేసి బయలుదేరాడు.

ఆ వచ్చినది నిజంగా దేవేంద్రుడే. శరభంగ మహామునిని బ్రహ్మలోకానికి తీసుకు





వెళ్ళటానికి స్వయంగా తన రథంలో వచ్చాడు. రాముడు తన కోసం వస్తున్నాడని గ్రహించి ఇంద్రుడు శరభంగుడితో, "రాముడు నన్ను కలుసుకోవటానికి వస్తున్నాడు. అతనివల్ల ఒక మహాకార్యం జరగాలి. అది ముగిసినదాకా అతనికి కన పడటం నా కిష్టం లేదు," అని చెప్పి తన రథ మెక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

తన ప్రయత్నం విఫలంకాగా రాముడు సీతా లక్ష్మణులను కలుపుకుని శరభంగుడి వద్దకు వచ్చి నమస్కరించాడు. అప్పటికే శరభంగుడు అగ్ని ప్రవేశం చెయ్యటానికి ఏర్పాట్లన్నీ చేసుకుని ఉన్నాడు.



రాముడు దేవేంద్రుణ్ణి గురించి అడగగా ఆయన, "అవును, నేను తపశ్శక్తి చేత బ్రహ్మలోకం సాధించుకున్నాను. నన్ను తీసుకు పోవాలని ఇంద్రుడు వచ్చాడు. నీవు నా కోసం వస్తున్నావని తెలిసి, నిన్ను చూసి మరీ పోదామనుకున్నాను. నేను సాధించిన బ్రహ్మలోక, స్వర్గలోకాలను నీకు దానం చేస్తాను, పుచ్చుకో," అన్నాడు.

"స్వామీ, నాకు కావలిసిన లోకాలను నేనే సంపాదించుకుంటాను. ప్రస్తుతం ఈ అరణ్యంలో నాకు వాసయోగ్యమైన చోటేదో చెప్పండి," అన్నాడు రాముడు.

"ఈ యేటి వెంబడే పోతే సుతీక్ష్ణ మహాముని ఆశ్రమం వస్తుంది. ఆయన నీకు తగిన చోటు చూపించ గలుగుతాడు. పాము కుబుసాన్ని విడిచినట్టు నేనీ దేహాన్ని విడవటం చూసి మరీ వెళ్ళండి," అంటూ శరభంగ మహాముని అగ్నిలో అజ్యం పోసి అందులో ప్రవేశించాడు. ఆయన శరీరం అస్థికలతో సహా దగ్ధమయాక, ఆయన ఇరవై అయిదేళ్ళ ప్రాయంగల దివ్య శరీరంతో అగ్ని నుంచి వెలువడటం చూసి సీతా రామలక్ష్మణులు నివ్వెర పోయారు.

శరభంగుడు దేహం చాలించగానే ఆశ్రమంలోని మునులందరూ రాముడి



వద్దకు వచ్చి, "రామా, పంపాతీరంలోనూ, చిత్రకూటంలోనూ, మందాకినీ తీరంలోనూ ఉండే ఋషులను రాక్షసులు చెప్పరాని హింసలు పెడుతున్నారు. వాళ్ళచేత చచ్చిపోయిన మునుల శరీరాలు ఎలా పడి ఉన్నాయో చూడు. క్రూరులైన ఈ రాక్షసుల బారినుంచి ఋషులను నీవే కాపాడాలి," అన్నారు.

"నేను అరణ్యవాసం రావటంలో తండ్రి ఆజ్ఞను పాలించే మేలు ఒకటే అనుకున్నాను. ఇప్పుడు నాకు మీ మూలంగా మరొక మేలు కూడా చేకూరుతుందన్న మాట. నేను తప్పక రాక్షసుల బారి నుండి మునులను కాపాడతాను," అని రాముడన్నాడు.

రాముడు సుతీక్ష్ణుడి ఆశ్రమానికి బయలుదేరుతుంటే వైఖానసుడు మొదలైనవారు అతని వెంట కదిలారు. వారందరూ కొన్ని నదులను దాటి, ఒక పర్వతం పక్కగా ఉన్న అరణ్యం ప్రవేశించారు. ఆ అరణ్యంలోనే సుతీక్ష్ణ మహాముని ఆశ్రమం ఉన్నది.

రాముడు తన పేరు చెప్పుకుని నమస్కారం చెయ్యగానే సుతీక్ష్ణుడతన్ని గుచ్చి కౌగలించుకుని, "రామా, నీవు చిత్రకూటం చేరినప్పటి నుంచీ నీ వార్తలు వింటూనే ఉన్నాను. నేను చాలా తపస్సు చేశాను.



అదంతా నీ కిస్తాను, సీతా లక్ష్మణులతో అన్ని లోకాలూ అనుభవించు," అన్నాడు.

"స్వామీ, లోకాలన్నీ నేనే సంపాదించుకుంటాను. నాకీ అరణ్యంలో నివాసయోగ్యమైన స్థానం ఉంటే చెప్పండి చాలు," అన్నాడు రాముడు.

"కావాలంటే ఈ ఆశ్రమంలోనే ఉండవచ్చు. ఇక్కడ మృగ బాధ తప్ప మరే బాధా లేదు," అని సుతీక్ష్ణుడు చెప్పాడు.

"నేను పొరపాటున ఆశ్రమ మృగాలను చంపినట్టయితే మీకు కోపం రావచ్చు. అందుచేత ఈ ఆశ్రమం నాకు వద్దు," అన్నాడు రాముడు.



సీతారామ లక్ష్మణులు ఆ రాత్రి అక్కడే సుఖంగా గడిపారు. మర్నాడు ఉదయం కాల కృత్యాలు ముగించి సుతీక్ష్ణుడితో, "స్వామీ, నా వెంట వచ్చిన మునులు తొందర చేస్తున్నారు. మాకు సెల విప్పించండి," అన్నాడు.

సీత రామలక్ష్మణుల ఆయుధాలు తెచ్చి ఇచ్చింది. దారిలో సీత రాముడితో, "ప్రపంచంలో మూడు మహా పాపాలు: అబద్ధం చెప్పటమూ, పర స్త్రీని కోరటమూ, అకారణ వైరమూనూ. అన్నిటిలోకీ అకారణ వైరం చాలా చెడ్డది. మొదటి రెండు పాపాలూ నిన్నంటలేవు, నాకు తెలుసు. కాని మనకు ఏ కీడూ చేయని రాక్షసులను నీ వెందుకు చంపాలి? వారిని చంపుతానని ఈ ఋషుల కెందుకు మాట ఇవ్వాలి? అసలు ఆయుధాలు వెంట ఉండటమే ఒక కీడు. పూర్వం ఒక ముని తపస్సు చేసుకుంటూ ఉంటే తపోభంగం కలిగించటానికి ఇంద్రుడు ఒక భటుడి రూపంలో వచ్చి తన కత్తిని భద్రంగా దాచి ఉంచమనీ, మళ్ళీ వచ్చి తీసుకుంటాననీ చెప్పాడట. ఆ ముని ఆ కత్తిని కాపాడటానికి వెంట ఉంచుకుని తిరుగుతూ, మొదట్లో పళ్ళూ ఫలాలూ కోశాడట. కాని రానురాను అతడి బుద్ధి హింసవైపు మళ్ళి, చివరకు చచ్చి నరకానికి వెళ్ళాడట. అందుచేత మనం కనీసం ఈ అరణ్యవాస కాలంలో నైనా ఆయుధాలు విసర్జించి తపస్సు చేసుకుందాం. తిరిగి అయోధ్యకు వెళ్ళాక క్షత్రియధర్మం పాటించవచ్చు. ఇది ఆదేశం కాదు, సూచన మాత్రమే," అన్నది.

రాముడు సీతతో, "ఆ మును లందరూ ప్రాధేయ పడితే వారి కోరికపై, రాక్షసులను చంపి వారి తపస్సు నిర్విఘ్నంగా కొనసాగిస్తానని మాట ఇచ్చాను. నిన్నూ, లక్ష్మణుణ్ణీ, నా ప్రాణాలనూ వదులుతాను గాని చేసిన ప్రతిజ్ఞ విడపను," అన్నాడు.



# 10. గ్రాండ్ కాన్యాన్

భూమిలో ఒక గాటును ఊహించండి. దాని నిడివి 217 మైళ్ళు, లోతు దాదాపు ఒక మైలు, వెడల్పు 4 లగాయతు 8 మైళ్ళు. అలాటి కనుమ ఉత్తర అమెరికాలోని అరిజోనా రాష్ట్రంలో ఉన్నది. అదే గ్రాండ్ కాన్యాన్. దీని అడుగున కొలరాడో నది ప్రవహిస్తున్నది. ఈ కనుమ దిగువభాగంలో ఉండే రాళ్ళు 150 కోట్ల ఏళ్ళనాటివి! భూమియొక్క చరిత్ర అంతా ఈ కనుమలో మనకు కానవస్తుంది.





# ప్రశ్నోత్తరాలు

1. యస్. రామచంద్రయ్య, సంతపేట

రాత్రులు నక్షత్రములను చూచునప్పుడు ఒక్కొక్క నక్షత్రము తానున్న చోటును విడిచి, క్రిందికి జారునట్లు కనిపించి, మధ్యలో అంతర్ధాన మవుతుంది. అలా జరుగుటకు కారణము సెలవిస్తారా?

అలా రాలినట్లు కనిపించేవి ఉల్కలు. నక్షత్రాలు ఎప్పుడూ ఒకే స్థానంలో ఉంటాయి. ఉల్కలు బయటి ఆకాశంలో నుంచి భూమి కేసి వచ్చి, గాలి ఒరిపిడికి వేడెక్కి మండిపోతాయి. ఇది భూమికి 150—250 మైళ్ల ఎత్తున జరుగుతుంది.

2. జె. సూర్యనారాయణరావు, గద్వాల

షష్టిపూర్తి అంటే అర్థమేమిటి?

అరవై పూర్తి కావటమన్న మాట. మనుషులు అరవై ఏళ్ళ వయసున షష్టి పూర్తి చేసుకుంటారు. నిమిషాని కొకసారి సెకండ్లకు షష్టి పూర్తి అవుతుంది. అలాగే గంట కొకసారి నిమిషాలకు షష్టి పూర్తి అవుతుంది.

3. బి. సాంబశివరావు, విజయనగరము

అన్నయ్యా, ఆగస్టు నెల "చందమామ"లో, "కుమారసంభవము"లో, చివరి బొమ్మలో బ్రహ్మ దగ్గిర అగ్ని హోత్రుడు ఉండవలిసినది ఒక స్త్రీ ఉన్నది. ఎవరో తెలుపుతారా?

ఆ బొమ్మలో ఉన్నది బ్రహ్మ కాదు, అగ్నిహోత్రుడే. ఆ స్త్రీ అగ్నిహోత్రుడి భార్య.

4. సర్వోదయ ప్రసాద్, సికందరాబాద్

ఫొటో వ్యాఖ్యల పోటీకి ఉపయోగించు ఫొటోలను ప్రత్యేకంగా నియమించబడిన వారే తీస్తారా, లేక మా వంటి పాఠకులు తీసిన ఫొటోలనుకూడ ఉపయోగిస్తారా?

"చందమామ"లో ఫొటో వ్యాఖ్యల పోటీకి ఉపయోగించే ఫొటోలన్నీ సిద్ధ హస్తులు తీసినవే. ఫొటోలు బాగున్నట్టయితే ఎవరు పంపినా పంపవచ్చు.

5. వంకెద్దు నాగమణి, సీలేరు

అన్నయ్యా, ఉత్పల సత్యనారాయణాచార్యగారి "పార్వతీ కల్యాణము" లోని హిమవంతుని భార్య మేనకయు, అప్సరసలలోని మేనకయు ఒకటేనా?

కాదు, హిమవంతుడి భార్య దక్ష ప్రజాపతి మనమరాలు.

6. వి. వై. గిరి, ఖమ్మం

అన్నయ్యా, ప్రపంచములోకెల్ల పెద్ద నది ఏది? అది ఏ దేశములో ఉన్నది?

ఎమెజాన్ నది. దీని నిడివి 4000 మైళ్ళు. ఇది దక్షిణ అమెరికాలో ఉన్నది.

7. టి. సీతారాం, ఛత్రపూరు

మామా, నేను మంచి కథను వ్రాసి దానికి తోడు నా ఫొటోను జతపరిచి పంపుతాను. "చందమామ"లో ప్రచురిస్తావా?

నిజంగా "మంచి" కథ అయితే ప్రచురిస్తాం. ఫొటో మాత్రం ప్రచురించం.

8. బొరిగె ధర్మారావు, గుమ్మలక్ష్మీపురం

బ్రదర్, "చందమామ"లో ఇంతమంది పంపుచున్నారు గాని అన్ని ప్రశ్నలకు జవాబు యివ్వకపోవటం కారణం ఏమిటి?

తోచక వేసే ప్రశ్నలకూ, కేవలం "చందమామ"లో తమ పేరు చూసుకునేటందుకు వేసే ప్రశ్నలకూ, అదివరకు జవాబు లిచ్చిన ప్రశ్నలకూ "చందమామ"లో చోటులేదు.

9. పెండ్యాల కృష్ణమూర్తి, నాగన్నపల్లి

"చందమామ" చిత్రకారు లంతా ఎక్కడ ఉంటారు? ఏయే ఉద్యోగాలు చేస్తున్నారు?

"చందమామ"లోనే ఉండి ఆర్టిస్టులుగా ఉద్యోగాలు చేస్తున్నారు.

10. యస్. యం. హనీఫ్, భువనగిరి

అన్నయ్యా, సింధూ నాగరికత, ఆర్యుల నాగరికతలలో ఏది మొదట భారత దేశములో వెలసినది?

సింధు నాగరికత పూర్తిగా మన దేశానికి చెందినది, ఎందుకంటే దాని స్థావరాలు మన కీనాడు కనిపిస్తున్నాయి. ఆర్య నాగరికత పైనుంచి వచ్చింది. ఈ రెండు నాగరికతల సమ్మేళనంలో సింధు నాగరికత క్షీణించి పోయింది. అయినా దాని ఛాయలు పూర్తిగా నశించలేదు.

Photo by P. Ram Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

తెల్లారిన బ్రతుకులకై...

పంపినవారు:
ఎస్. సింహాచలం, హైదరాబాద్

Photo by A. L. Kantha Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

తెలిపేదెలా మేలుకొలుపు!

పంపినవారు:
ఎస్. సింహాచలం, హైదరాబాద్

# మూఢ భక్తి ★ [రామతీర్థ కథ]

ఒక గ్రామంలో ఒక పండితుడుండే వాడు. ఆయనకు ఒకనాడు దూర ప్రయాణం చేసి రావటం వల్ల ఒళ్లంతా నొప్పి చేసింది.

ఆయన తన శిష్యుణ్ణి పిలిచి, "ఒరే, ఒళ్ళంతా నొప్పులుగా వుంది. ఈ చాప మీద పడుకుంటాను. మీద నిలబడి, నీ కాళ్ళతో శరీరాన్ని కాస్త మర్దన చెయ్యి," అన్నాడు.

గురువుగారి మాటలు వింటూనే శిష్యుడు నోరూ నెత్తి కొట్టుకుంటూ, "గురువుగారూ, ఎంతమాట! మీ పవిత్రమైన శరీరాన్ని నా కాళ్ళతో తొక్కి పాపం కట్టుకోమంటారా? నా ప్రాణమైనా యిస్తాను, అడగండి. అంతేకాని, ఈ పాపకార్యం మాత్రం చెయ్యను," అన్నాడు.

దానికి గురువు చిరునవ్వు నవ్వి, "ఒరే, నీకు నా మాటల మీద కన్న, నా శరీరం మీద ఎక్కువ భక్తి వున్నట్టుంది. నువ్వు నా శరీరం మీద కంటె, అది పలికే మాటల మీద ఎక్కువ గౌరవం చూపటం నేర్చుకోవాలి," అన్నాడు.

శిష్యుడు తన తప్పు గ్రహించి, గురువుగారు చెప్పినట్టు చేశాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తెల్లారిన బ్రతుకులకై...

రెండవ ఫోటో : తెలిపేదెలా మేలుకొలుపు!

పంపినవారు : ఎస్. సింహాచలం,

పంజగుట్ట అఫిషియల్ కాలనీ, హైదరాబాద్.

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్ట చివరి బొమ్మ

ఎవరెన్ని విధాల చెప్పినా ధర్మరాజుకు వైరాగ్యం వదలలేదు. అప్పుడు కృష్ణు డాయనకు షోడశ మహారాజుల కథలు చెప్పి, అనంతరం సృంజయుడి కథ ఈ విధంగా చెప్పాడు:

ఒకప్పుడు నారదుడూ, ఆయన మేనల్లుడైన పర్వతుడూ లోకసంచారం చేస్తూ సృంజయుడనే రాజు వద్దకు వెళ్ళారు. వారిద్దరి మధ్యా రహస్యాలు లేవు. ఎవరు రెండోవారి వద్ద ఏ సంగతి దాచినా శాపఫలం పొందేటట్టు వారు ఒప్పందం కూడా చేసుకుని ఉన్నారు.

సృంజయుడు ఆ మహర్షులకు ఆతిథ్యం ఇచ్చి, వారికి సపర్యలు చెయ్యటానికి సుకుమారి అనే తన కుమార్తెను నియమించాడు. నారదుడికి ఆ పిల్ల మీద ప్రేమ ఏర్పడి క్రమంగా వృద్ధి కాసాగింది. అయితే ఈ సంగతి నారదుడు తన మేనల్లుడైన పర్వతుడికి చెప్పక దాచాడు. అయినా పర్వతుడీ సంగతి గ్రహించి, "నీ వా పిల్లను పెళ్ళాడిన మరుక్షణం కోతివైపోతావు గాక!" అని తన మామను శపించాడు. "నీకు స్వర్గలోక సంచారం లేకుండా పోవుగాక!" అని నారదుడు ఎదురు శాపం పెట్టాడు. తరవాత మామా అల్లుళ్ళు విడిపోయారు.

నారదుడు సృంజయుడి వద్దకు వెళ్ళి తనకు సుకుమారి నిచ్చి పెళ్ళి చెయ్యమని కోరాడు. రాజు ఒప్పుకుని పెళ్ళి చేశాడు. నారదుడు కోతిగా మారిపోయాడు. కొంత కాలమైనాక పర్వతుడు నారదుడున్న చోటికి వచ్చి తనకు స్వర్గలోక సంచారం అనుగ్రహించమన్నాడు. అప్పు డిద్దరూ తమ శాపాలను ఉపసంహరించుకున్నారు.

వారు కొంతకాలం సృంజయుడి వద్ద ఉన్నమీదట పర్వతుడు సృంజయుణ్ణి ఒక వరం కోరుకోమన్నాడు. ఇంద్రుడితో సమానుడైన ఒక కొడుకు నిమ్మని సృంజయుడడిగాడు.

"అలాగే ఇస్తాను కాని నీవు వాణ్ణి ఇంద్రుడి బారి నుంచి కాపాడుకోవాలి సుమా!" అన్నాడు పర్వతుడు.

"వాడికి దీర్ఘాయువు కూడా ఇవ్వండి," అని సృంజయు డడిగితే పర్వతుడు బదులు చెప్పలేదు. అది చూసి నారదుడు, "నీ కొడుకుకు ప్రాణాపాయం కలిగితే నేను బతికిస్తాను," అని సృంజయుడికి మాట ఇచ్చాడు.

నారద పర్వతులు వెళ్ళిపోయాక సృంజయుడికి సువర్ణష్ఠీవి అనే కొడుకు కలిగాడు. వాడి కీర్తి ప్రపంచమంతటా వ్యాపించటం చూసి, వాణ్ణి చంపి రమ్మని తన వజ్రాయుధాన్ని ఇంద్రుడు వ్యాఘ్రరూపంలో పంపాడు. ఒకనాడు సువర్ణష్ఠీవిని వాడి దాది వనానికి తీసుకు రాగా ఆ పులి వాణ్ణి చంపి అంతర్ధానమయింది. ఈ సంగతి తెలిసి పుత్రశోకంతో ఏడుస్తున్న సృంజయుడి వద్దకు నారదుడు వచ్చి తత్వబోధ చేసి, ఇంద్రుడి అనుమతితో ఆ కుర్రవాణ్ణి తిరిగి బతికించాడు.

**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

★

# చందాదారులకు
# గమనిక!

★

చందమామ కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పు చేయవలసివస్తే, 5-వ తేదికి లోగానే, మీ చందా సంబరును కనుపరచుచూ, మాకు తెలుపాలి. ఆలస్యమైతే తర్వాత నెలవరకు మీ కొత్త అడ్రసును అమలులో పెట్టడానికి వీలుండదు.

మీ సహకారాన్ని కోరుచున్నాము.

సర్క్యులేషన్ మేనేజరు.

★

# లాభదాయకమైన లఘు పరిశ్రమ ప్రారంభించండి

"అధునాతన కుటీర పరిశ్రమలు" (తెలుగు) పుస్తకంలో లాభదాయకమైన వివిధ పరిశ్రమలు వున్నాయి. ఈ పరిశ్రమలలో వున్నవారు చక్కటి లాభాలను ఆర్జిస్తున్నారు. ప్రతి పరిశ్రమనుగూర్చి సంక్షిప్తమైన వివరాలు, ముడిపదార్థాలు లభించే చోట్లు, ముడి పదార్థాల కొనుగోలుకు, వాయిదాల పద్ధతిన యంత్రాల కొనుగోలుకు ప్రభుత్వం యిచ్చే సహాయం - యిందులో వున్నాయి. లఘుపరిశ్రమలు ప్రారంభించ దలచుకున్న వ్యక్తుల సమస్యలకు తగిన పరిష్కార మార్గాలు యిందులో వున్నాయి.

పుటలు 878, సుమారు 300 బొమ్మలు

ధర రూ. 13 | తపాల రుసుము రూ. 1-50

## COTTAGE INDUSTRY

Telephone No. 229835

(CN-3) P. B. 1262, JAMUNA ROAD, DELHI - 6.

మనోహరమైన
ముఖలావణ్యమునకు











సినిమా తార
లందరకు నచ్చినది

ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 * మదరాసు-1

“ఏవిటే!
ఇంట్లో
# అమృతాంజనం
లేదా?

నా తలనొప్పి ఎలా తగ్గుతుంది?”

ఏమో ఎప్పుడు అవసరమొస్తుందో ఎ ప్పుడూ
అమృతాంజనం దగ్గర వుంచుకోవటం ఉత్తమం.
అమృతాంజనం యింట్లో వుందంటే మీరు నిశ్చిం
తగా వుండవచ్చు.

అమృతాంజన్ లిమిటెడ్
14/15 లజ్ చర్చిరోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.




JWT AM 1881a




హాయి గొలిపే పరిశుభ్రంగా వుండండి! లైఫ్‌బాయ్‌తో
స్నానంవల్ల ఉత్సాహంతో ఉప్పొంగి పొండి! జ్ఞాపక
ముంచుకోండి, స్నానం చేయునప్పుడు లైఫ్‌బాయ్ మురికిలో
గల క్రిములను కడిగివేయును — ఎంతో ఆరోగ్యవంత
మైన హాయి గొలుపును! ఔను, లైఫ్‌బాయ్‌తో
కుటుంబంలో అందరి జీవితం ఆరోగ్యవంతం.

**ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో అక్కడ ఆరోగ్యము వున్నది!**

L.33-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

# పనామా

## సౌందర్య సాధనాలు

పనామా సౌందర్య సాధనాలు మీ అందాన్ని ఇను మడింప చేస్తాయి. పనామా సౌందర్య సాధనాలు — ఫేస్ పౌడర్, టాల్కం పౌడర్, ఫ్రేగన్ టాల్క్, షెప్రాన్ స్నో, పనామా పొమేడ్ — ఇవన్నీ మిమ్ము సౌందర్య జలధిలో జలక మాడి స్తాయి. పైగా నిగనిగలాడే కేశలావణ్యానికి పనామా "బ్రిలియంటైన్" కంటె మరో సాధనం లేనేలేదు!

ముగ్ధ మనోహరత్వానికి

PANAMA FRAGRANTALC

PANAMA POMADE

SHEPRON DE-LUX SNOW

PANAMA TALCUM POWDER

వైజయంతీమాల
ఆవాదీకి హవా చిత్రంలో

పనామా ప్రైవేట్ లిమిటెడ్
కలకత్తా బొంబాయి న్యూ ఢిల్లీ

సోల్ ఏజంట్: లాలా గోపికృష్ణ గోకుల్‌దాస్
114, మింట్ స్ట్రీట్, మద్రాసు - 1.

